ఖడ్గపట్టసములఁ బూన్కిఁ ♦ గైకొని యల, దనుజవీరుల ఖండించి ♦ రనుపమగతి.

చ. తనసచివానుకోత్తము లు ♦ దారమతుల్ గొలువంగ దానవే
శునియనుజుండు గర్వమున ♦ శోభిలు నేన్గుల మధ్యభాగమం
దనువుగఁ జూడనొప్పు సుద ♦ హస్తివిధంబునఁ జూడనయ్యె, నా
దనుజవరుండు కాలముఁ ♦ తత్త్వవిదుత్తముఁ డొట నత్తఱిన్ ౭౪ 3924

ఆ. అసురగణముతోడ ♦ ననిచేయ వేడుక,పడెడు వానరులను ♦ గడఁగి మఱియుఁ
బ్రోత్సహింప నెంచి ♦ బుద్ధిబలంబున, నప్పటికిని దగిన ♦ యట్లు పలికె ౭౫ 3925

చ. హరివరులార! రావణున ♦ కారయ వీఁడొకఁడే నిజంబుగాఁ
బరమసహాయుఁడై చెలఁగు ♦ వానిబలంబులు పోయి వీఁడె యొ
క్కరుఁడు మహాబలుం డిచటఁ ♦ గ్రాలు నదేలొకొ మీర లూరకి
త్తరుణమునందు నుండెదరొ, ♦ దారుణపాపుఁడు వీఁడు నియ్యెడన్. ౭౬ 3926

క. హతుఁడైన యెడల నవ్వల, దితిజాధిపుఁ డొకఁడె తప్పఁ ♦ దెగినయదియె యా
నతనిబల మెల్ల, వీరుం, డతులితబలుఁడౌ ప్రహస్తుఁ ♦ డంతము నొందెన్. ౭౭

సీ. గురుబలుండైన ని ♦ కుంభుండు, కుంభకర్ణుండును మఱియుఁ గుం ♦ భుండు పిదప
నాజంబుమాలి,ధూ ♦ మ్రాక్షదానవుఁడు,సుహామాలియును దాన ♦ వాధిపతియు
నశనిప్రభుండును, ♦ యజ్ఞకోపుఁడు, తీక్ష్ణవేగుండు, నిఘ్నుండు, ♦ వికలుఁ డల్లె
సుప్తఘ్న,వజ్రదం ♦ ష్ట్రులును,సంహ్రాదియుఁ,దపన,ప్రఘాసులు, ♦ దముఁడుప్రఘసుఁ,

తే. డాప్రజంఘుఁడు, దుర్ధర్షుఁ, ♦ డగ్నికేతు
వల్లె జంఘుఁడు, వీరుఁడై ♦ యలరుచున్న
రశ్మికేతు, విద్యున్మాలి, ♦ రాక్షసులును
సూర్యశత్రు, ద్విజిహ్వులు, ♦ శూరవరులు ౭౮ 3928

తే. చక్రమాలి, సుపార్శ్వుండు, ♦ శౌర్యఘనులు
కంపనాకంపనులు, బల ♦ గర్వయుక్తు
లైన దేవాంతక, నరాంత ♦ కాహ్వయులును
సమరరంగంబు నందిందుఁ ♦ జంపఁబడిరి. ౭౯ 3929

చ గురుబలవంతులౌ దనుజ ♦ కుంజరులన్ దురమందుఁ బెక్కురన్
గరము పరాక్రమక్రమము ♦ గన్పడఁ జంపి సుహాంబురాశినిం
గరముల నీఁది దాఁటితిరి ♦ గా, యిఁక రావణసూను నీతనిన్
బొరిగొను టెల్ల గోష్పదముఁ ♦ బోలఁగుఁ జుల్క నగాదె? మీ కనిన్ ౮౦

చ. వనచరులార! యీపనియు ♦ స్వల్పముగావున దీనిఁగూర్చి జ
క్కనిదగు శక్తిఁ జేయుఁడు ని ♦ కామబలంబున గర్వయుక్తిచే
ఘనులగు నెల్లరాక్షసు ల ♦ ఖండజవంబున వచ్చి తాఁకి మీ
యనుపమశక్తిఁ జంపఁబడి ♦ రారయ నీతఁడె శేష మిత్తఱిన్. ౮౧ 3931

తే ఇంతమాత్రమె మీరలీ♦ యెడజయింప,వలయు పయమాలినేరము ♦ వరునికొఱకు
భ్రాతృపుత్రుని నైన నీ♦ బవరమందుఁ, జంపివైతును గాని సం♦ న్సంశయముగ.

క. పినతండ్రి నగుచు నాకుం, దనయుండగువాని నింద్ర♦ దన్యు నితని నే
నని వధియించుట తగ, దిం,కను నీతనిఁ జంపఁ గోరఁ♦గా నామదిలోన్. ౧౭

సీ కన్నీరు చక్కఁగాఁ ♦ గ్రమ్మి నాచక్షుస్సు నావరించుచునున్న ♦ దట్టులౌట
వాని మహాబాహుఁ ♦ డైన యీలక్ష్మణుండే వధించును, ప్లవ♦ గేంద్రులార!
కూడి మీరంద ఱీ♦ క్రూరాత్మునకు సాయపడఁ జెంతనున్న యీ♦ భటుల నెల్లఁ
బొలియింపుఁడనియె, నా♦ స్తులకీర్తిమంతుఁడౌ నావిభీషణుఁ డిట్టు ♦ లఖిలకపులఁ

ఆ. బ్రోత్సహింప వనచ♦రులు హర్షముంబొంది, వాలములను ద్రిప్పి♦ లీల మాటి
మాటి కతులరీతి♦ మహితసింహధ్వనుల్, చేయుచుఁ ముదంబుఁ♦ జెందియపుడు.

క. ఘనములఁ గని కేకులు ని,స్వనముల నొనరించునట్లు ♦ పలుభంగుల ని
స్వనములఁ జేసిరి, భల్లూ,కనృపతి యాతరుణమందుఁ ♦ గడుఁబూన్కి మెయిన్.

తే సకలసేనావృతుండయి ♦ శౌర్యయుతర
శిలల నఖములఁ బండ్లను ♦ జెలఁగుదనుజ
భటుల నొప్పించె, నమ్మహా♦ బలులు దనుజు
లట్లు ప్రహరించుచుం జెలు♦ వారు నతని. ౨౧ 3936

చ మనమున భీతి నించుకయు ♦ మాని యనేకవిధాయుధంబులం
గొని త్వరఁ జుట్టుముట్టి, రిటు ♦ క్రూరమనస్కులు వారు పూనికన్
దనుజులఁ గొట్టుచున్న ఘన♦ దర్పుని భల్లుకనాథు జాంబవం
తుని శరయష్టిసంతతులఁ ♦ దోమరతీక్ష్ణపరశ్వథంబులన్ ౨౩ 3937

తే. పట్టసంబుల నొంచిరి, ♦ ప్లవగదనుజ, తుముల సంగరమద్ది క్రు♦ద్ధులగు దేవ
దనుజసంగరమట్లునా♦ తాంతరవము, గలిగభీమంబుగాన య్యెఁ ♦ జెలఁగియపుడు.

చ. ఘనబలశాలియై వెలయు ♦ గాలికుమారుఁడు విశ్రమార్థమై
తనపయినుండి లక్ష్మణుఁడు ♦ తత్సమయంబునఁ గ్రిందికేగుటన్
దనుజులపౌరుషంబుఁ గని ♦ దాని సహింపక వృక్ష మొక్కఁ డొ
య్యనఁ బెకలించి రాక్షసుల ♦ నయ్యని వేవురతోడ మార్కొనెన్. ౨౫

తే. ఇంద్రజిత్తట్లు పినతండ్రి ♦ కెంతొ తుముల
సంగర మొసంగి సంపెస♦ సమితిఁ బంపు
నాసుమిత్రాత్మజునిపైఁ ♦ బరరి మరల,
నంతటన్ సుప్రసిద్ధులై ♦ యరిహరులయి. ౨౬ 3940

తే వీరులై తగు హరిరువు ♦ రీరసమ్ముగ
బాణవర్షంబుఁ గురియుచుఁ ♦ బటుతరగతి

నాకరినాక్కరు నొప్పించి ♦ రుద్యమమున,
వేగవంతులు గురుబలుల్ ♦ విమతిహరులు ౨౭౹ 3941

చ అనుపమవిక్రమాఢ్యులును ♦ నా నరదానవనాథనందనుల్
ఘనములచేత వృష్టితగు ♦ కాలమునన్ రవిచంద్రు లొక్కరీ
తిని గనరాకయుండెదు గ ♦ తిన్ శరపంక్తిని గొంతకాలమున్
గనఁబడకుండి, రిద్దఱును ♦ గ్రమ్మఱఁ బోరుచు నుండున త్తఱిన్. ౨౮౹ 3942

సీ. కరలాఘవంబులు ♦ గల్గినవారౌట నమ్ములపొదినుండి ♦ యంబకములఁ
దీయుటగాని సం ♦ ధించుటయేగాని సవ్యాపసవ్యసం ♦ సరణిఁ జాప
ముల మార్చి తమకరం ♦ బులఁబట్టుటయుఁగానిశర మోక్షణముగాని ♦ జ్యాలతలను
జక్క లాగుటగాని ♦ స్థానవిశేషముల్ గలుగంగ నిల్చుట ♦ గాని ధనువుఁ

తే. బిడికిటం బట్టుటయుఁగాని ♦ కడఁగి లక్ష్య
మును రివంతయుఁ దప్పకుం ♦ డను శరముల
వైచుటయుఁ గాని కనుఁగొనఁ ♦ బడకయుండెఁ,
ాపవేగవినిర్ముక్త ♦ శరతతు లొగి. 30౹ 3943

క సురపథమును కప్పటచే, శరములు కన్పడుచునున్న ♦ సరణి విడిచి యొ
క్కరువుఁడు కన్పడకుండె ని,తరవస్తువుఁ దోఁపకుండెఁ ♦ దద్దయు గనినన్

చ. దనుజుని రాఘవానుజుఁడు ♦ తాఁర్కొనినప్పుడు గాని రాముత
మ్ముని దనుజుండు మార్కొనుచుఁ ♦ బోరెడున త్తఱిఁ గాని యాతఁడీ
తని నని నొంచు నంచు మదిఁ ♦ దట్టకయుండెను, వార లాతురం
బునను బరస్పరంబు గెలు ♦ వుం గొను వాంఛల వైచుబాణముల్ 3౨౹ 3945

తే. ఆకసమునందు నేమాత్ర ♦ మైన నందు, గలుగకుండఁగనిండఁ జీఁ ♦ కట్లు గ్రమ్మి
నట్టులుండెను; వారల ♦ వగు నిశాత,బాణములు శతసంఖ్యలు ♦ పరఁగి యపుడు.

క. కలయన్ నిండెను దిగ్విదిశల, సూర్యుం డస్తమించు ♦ సమయమునఁ దమ
స్సులు సర్వము గప్పెడున,ట్టులు చీఁకటి గప్పె నప్పు ♦ డు భయదరీతిన్ 3౫౹

ఆ రక్తనదులు వేలు ♦ ప్రవహించెగొప్పగాఁ,బలలమును గ్రసించు ♦ భయదమృగము
లతిభయంకరముగ ♦ నార్చె న త్తఱి భయం,బునను వీవకుండె ♦ ననిలుఁ డట్లు.

క. అనలుఁడు మండకయుండెను:, మునివర్యులు లోకనివహ ♦ ములకు శుభంబుల్
దనరును గాకని పలికిరి, మును పాసంగరముఁ జూచు ♦ ముదమున నటకున్.

క. చనుదెంచిన గంధర్వులు, చని రింకొకచోటి కన్లై ♦ చారణయుతులై
యసి దానిఁ జూడనోడుచు,, దనుజుం డారీతిగఁ బ్రవి ♦ దారణము గడున్. 3౮

చ. ఒనరుచుచుండ రాఘవుస ♦ హోదరుఁ డప్పుడు నాల్గుబాణముల్
గొనుచుఁ బదీయనీలతను ♦ ఘోటకరాజచతుష్కమున్ లస

త్కనకవిభూషణాంచితము ♦ గాఁడఁగ వేసె, ననంతరంబ చ
క్కనిరుచి మించు లక్ష్మణుఁడు ♦ కాంతిని మించుచుఁ జాలఁ దీక్ష్ణమై. ౩౯

తే. పర్వముల నొప్పి తెల్లనై ♦ పరఁగుభల్ల
మొక్క దానిని గొని దానిఁ ♦ జక్క లాగి
యింద్రవజ్రసమానమై ♦ యెసఁగుచుఁ దల
శబ్దమున మించు సాయకా♦శనిని దాని ౪౦ 3952

క ధనువునఁ గూర్చి లాఘవమున మెఱయుచుఁ జిత్రగమన♦ములఁ దనరం బో
య్యన నడుపుచున్న యింద్రజి,తుని సారథితలను సట్టె ♦ త్రుంచెం గడఁకన్.

క. ఆయసురేంద్రునితనయుం, డాయవనున సారథి యటు ♦ హతుఁడైనను దా
నే యాపనిఁ జేయుచు నని, చేయుచునే యుండె ధనువు♦చేత మెఱయఁగన్.

తే. అతులతేజంబునం బొల్చి ♦ యాతఁ డిట్లు
సంగరము చేయ నాతని ♦ శక్తిఁ గాంచి
యెల్లవా రద్భుతం పడి, ♦ రేపు మీఱ
నడరి సౌమిత్రి యసురేంద్రు♦నరిని గాంచి ౪౩ 3955

క. ఆతనికరములు తురగ,వ్రాతంబునఁ దోలునట్టి ♦ వ్యాపారమునం
దే తగిలియుండుటం గని, యాతని నొంచెన్ మహాశి♦తాంబకవితతిన్ ౪౩

క. ధనువును గరములఁ గైకొనఁ, గని యాతనిఘోటకములఁ ♦ గాండంబులచే
తనునొంచె, లక్ష్మణుం డా,తనియందుం గానఁబడెడు ♦ తచ్ఛిద్రములన్ ౪౪

క కని శరమోక్షణమునఁ జ,క్కని లాఘవ మలరువాఁడు ♦ గావుననే స్వం
దన మెక్కి తిరుగు నాతని, మనమున నేభీతి లేక ♦ మహితశరములన్. ౪౫

తే కరము బాధించె, నింద్రారి ♦ కదనమందుఁ
దనదు సారథి తెగుటయుఁ ♦ దన్ను నట్లె
వైరి నొంచుటయును గాంచి ♦ బవరమందుఁ
దనకుఁ గల గర్వమును వీడి ♦ దైన్యమొందె ౪౬ 3959

చ వనచరయూథనాయకులు ♦ వాసవవైరి విషణ్ణవక్త్రుఁడై
కనఁబడుచుంట మిక్కిలియుఁ ♦ గ్రాలిరి హర్షమునన్ మహాత్ము రా
మునియనుజన్ము స్తోత్రములఁ ♦ బోల నుతించిరి, దానవేంద్రునిం
గనుచుఁ దదీయవిక్రమము ♦ గర్వము నోర్వక యప్పు డేవునన్ ౪౭ 3960

తే. హరివరుల్ గంధమాదనా♦హ్వయుఁడు రభసుఁ
డనఘమతియా ప్రమాథియు ♦ నడరి, రట్లు
భయదవీర్యులు బలయుతుల్ ♦ వారు నల్వు
రింద్రజిత్తుని యాటోప ♦ మేఁచ నెంచి ౪౮ 3961

క అరసము లాగెడు ఘోటక,నరములు నాల్గింటి పైని ♦ బడిరి జవమునన్;
గిరిసమతనులగు నవ్వన,చరవీరులు పైన దుముక ♦ నత్వ మెడలుటన్. ౪౯

ఆ తురగములవి యాఁగి ♦ తోరపుశక్తిని, జూపఁ జాల కెంతో ♦ తాపమంది
తనముఖములనుండి ♦ దారుణరక్తంబు, గాఱుచుండ నుండె ♦ గర్వముడిగి.
క. తురగము లవి యవయవములు, పరమాకులతం గనంగ ♦ బడలి యసువులన్
ద్వర వీడి ధరణిఁగూలెను,, హరివీరులు వార లిట్టు ♦ లాతురగములన్, ౫౦౻
క. హత మొనరించి రథంబున్, క్షితిఁ బడఁగాఁ గూల్చి మగలఁ♦జెచ్చెఱ లంఘిం
చి తగన్ నిల్చిరి రాఘవు,నితమ్ము చెంత, నిటు లశ్వ♦నికరము తెగినన్. ౫౧౻
తే నారథియుఁ గూలుటయు నట్టి ♦ స్యందనమును
విడిచి ధరణికి లంఘించి ♦ విశిఖవృష్టి
నిగుడఁ జేయుచు లక్ష్మణు♦నిపయి కడరె,
నంత నింద్రోపముఁడు రాఘు♦వానుజుండు. ౫౨౻ 3966
చ. తనపయిఁ దీవ్రబాణముల ♦ దారుణరీతిని వైచుచున్ జవం
బునఁ జనుదెంచుచున్ ధరణిఁ ♦ బొందిన రావణిఁన్ రణాంగణం
బున నిశితాంబకంబులను ♦ భూరితరాస్త్రములన్ మహాబలం
బునఁ బరఁగించుచున్ రిపుని♦పొంగు నడంచెఁ గపుల్ బళీ యనన్. ౫౩౻
తొంబదియవ సర్గము సంపూర్ణము.

## ౯౧-వ సర్గము.

ఇంద్రజిత్తు హతుఁ డగుట.

చ తురగము లిట్లు గూలుటయుఁ ♦ దోడనె భూస్థలిపైన నింద్రజి
త్తురుతరతేజ మొప్పునటు ♦ లుద్ధతిచే నిలుచుండి క్రుద్ధుఁడై
కరము జ్వలించుచుండెఁ, బటు♦కార్ముకముల్ ధరియించియున్న యా
యిరువురు తీవ్రబాణముల ♦ నేచి పరస్పరమున్ వధింపఁ ద
త్తరుణమునందుఁ గోరుచు ను♦దగ్రపరాక్రము మొప్పుచుండఁగన్. ౧౻ 3968
క వన్యజనులిట్లు విజయం,బునకై మార్కొనిరి, దనుజ♦పూగంబులు న
వ్వనచరబలములు నెల్లెడ, ననిఁ దిరుగుచు నొకరినొక్క ♦ రతులబలములన్
ఆ. చంపుచుం జెలంగి ♦ సాహసములఁ దమ, యధిపు విడువకుండి, ♦ రంత నింద్ర
వైరి స్వీయదనుజ♦వారంబులకు నుబ్బు, గలుగ వారి స్తోత్ర♦ములను దన్పి ౩౻
క. తానలరుచు నిట్లనెః నో, దానవులారా! వినుండు ♦ తమసు ఘనముగా
నానాదిక్కుల నిండెను, గాన నిటన్ స్వపరభటని♦కాయ మిగనుచున్. ౪౻
తే. తెలియకున్నది ఛేద మీ♦వలిముఖులను
మోసగింపంగ మీరొక్క ♦ మొగిని నిల్చి
పోరుచుండుఁడు నేనిదె ♦ పోయి యరద
మెక్కి వచ్చెద నని చేయ ♦ నిచటి కెలమి. ౫ 3972

క. పురి కేను జన దురాత్ములు, హరు లని నాతో డఁ జేసి ♦ యటుపోవుట కం
తరము గలిగింపకుండఁగ, దుర మొనరుపవలయు మీరు ♦ దోర్బలశక్తిన్. ౭

క. అరిహంత రావణియుఁ గ, ప్పురంకు నీతిఁ బలికి ♦ పోయెఁ బురికి నా
హరులను వంచించి మహా, త్వరరథ మెక్కెండు శేక ♦ ధైర్యస్ఫూర్తిన్. ౮

చ. అని విజయంబుఁగాంచెడు మ♦హాత్తర తేజుఁడు వానవారియుం
గనకవిరాజితం బగుమఁ ♦ గాంతము నై తగి ప్రాసఖడ్గరా
జిని మఱి యుత్తమాశ్వములు♦చే నలరారుమనున్న స్యందనం
బును హయతత్త్వవేత్తయయి ♦ పొల్చి హితంబును జెప్పఁజాలి నే
ర్పునఁ దగునట్టి సారథియుఁ ♦ బొంకముగా నకంగ నెక్కెఁ దాన్ ౧౦

క. తన తేజంబున నాస్యం,దనమును వెలుఁగంగఁ జేసి ♦ దానవరాజేం
ద్రునిపుత్త్రుఁడు కాలునిచేఁ,తను ప్రేరితుఁడగుచు ఘోర♦దనుజతతులతోన్.

[1]ఆ కలిసి లంక వెడలి ♦ కడు వేగమున వచ్చె, శత్రువీరహంత ♦ శక్రవైరి
జవనవాజినికర♦సంశోభితస్యంద,నమ్ము నెక్కి యలరి ♦ నగరము విడి ౧౧౪

క. చనుదెంచి యవ్విభీషణుఁ, డనూనబలశాలి రాము♦ననుజుండును నుం
డినచోటుఁ జేరె మార్గ,మ్మునఁ, గను వేగరపడుచు, నంత ♦ క్షణమాత్రమునన్.

చ. అరదము నెక్కి వేడుక మ♦హాహవరంగమునందునుండి యె
ల్లరఁ గనుమాసి యేగి తన♦లంకను జొచ్చి మహారథంబు నె
క్కి రయముమీఱి వచ్చి తము ♦ గెల్వఁగ నున్న [2]మనీషివర్యు శ
క్రరిపుని గాంచి లక్ష్మణుఁడు ♦ కర్బురసత్తముఁ డాహరీశ్వరుల్. ౧౩ 3799

ఆ. విస్మయంబు నొంది ♦ విమతుని లాఘవ
మును నుతించి, రంత ♦ దనుజనాథ
సుతుఁడు కోప మూని ♦ శతసహస్రములుగఁ
గపులఁ గూల్చె బాణ♦గణము వైచి ౧౪ 3980

క సమితింజయుఁడో రావణి, యమానుషంబై యహార్య♦మగు చాపంబో
సమయమున మండలాకృతి, నమరంగాఁ జంపసాగె ♦ నవ్వానరులన్. ౧౫ 3981

చ. దనుజుఁడు క్రోధవేగమునఁ ♦ దమ్ము వధించుచునుండ నోర్వలే
క నిఖిలవానరుల్ తమయా♦ఖండపరాక్రమముల్ కలంగఁగా
వనజభవుం బ్రజాపతిని ♦ వంతఁ బ్రజల్ శరణంబు వేఁడున
ట్లనుపమవిక్రమాఢ్యుఁడగు ♦ నారఘువీరుని జేరి రార్తులై. ౧౬ 3982

ఉ సంగరకోపవేగమునఁ ♦ జాల జ్వలించి సుమిత్రసూనుఁ డం
బొంగెడు హస్తలాఘవము ♦ బూనికఁ జూపుచు నింద్రవైరిచే
తం గలకార్ముకంబు నొక♦దారుణబాణముచేతఁ ద్రుంచె న

1 అభ్యయాజ్జవనై రశ్వైః-అనిమూ 2 లాఘవా త్తస్య ధీమతః-అనిమూ

ట్లంగద నొందె యింద్రరిపు ♦ నప్పుడ వేఱొకచాపవర్యమున్. ౧౭ 3983
క ధరియించి యెక్కు పెట్టఁగఁ, ద్వరపడి లక్ష్మణుఁడు మూఁడు♦బాణంబులఁ ద్రుం
చె రహిన్ విగతశరాసను, సురరిపుపుంగవుని గాంచి ♦ శుంభచ్ఛక్తిన్. ౧౮
ఆ లక్ష్యశుద్ధి యలర ♦ లక్ష్మణుఁ డాశని,యురమునందు విమథ♦రోగ్రవిషము
వలె వెలుంగు పంచ♦బాణంబులన్ వైచి,నొంచె, నిట్లు లక్ష్మ♦ణుండు పూన్కి.
చ. గురుతరకార్ముకంబునను ♦ గూరిచి వైచిన యాశరంబు లా
శరుతనువుం బగుల్చి యట ♦ సాంద్రతరంబగు నల్ల మన్ని భీ
కరతరరక్తసర్పములు ♦ గ్రాలెడునట్లు చొరంబడెన్ గడున్
ధరణిని, రావణాత్మజుఁడు ♦ తచ్ఛరముల్ కవచంబుఁ జెండినన్. ౨౦ 3986
తే. వదనమునుండి రుధిరంబు ♦ వదలుచుఁ గడు
సారవంతము దృఢగుణ♦సంయుతంబు
నైన కార్ముకవర్యంబుఁ ♦ దాను బూని
హస్తలాఘవమున రాము♦ననుజుపైన. ౨౧ 3987
క. శరవృష్టి నిగుడఁ జేసెను, బురందరుఁడు వృష్టిఁ గురియు♦పోలిక, నటనా
యరినూదనుండు లక్ష్మణుఁ, డరాతిసుదురాసదమగు ♦ నాశరవృష్టిన్. ౨౩ 3988
క మనమునఁ గలవిలపాటుం, గన కల్లన నడిపెఁ దీవ్ర♦కాండంబుల నొ
య్యన, నత్తఱి గురుతేజుఁడు, ఘనరఘుకులనందనుండు ♦ కదలని కడఁకన్.
క. కలఁతం బొందక వైరికి, నలఘుపరాక్రమము చూపె ♦ నది యద్భుతమై
వెలసెన్ గనువారికి, ని, మ్ములు లక్ష్మణుఁ డంతఁ గ్రోధ♦మూర్ఛితుఁ డగుచున్.
చ అనిఁ దనయస్త్రమోక్షణర♦యంబును జూపుచు నందు నున్న యా
దనుజుల నెల్ల నొక్కొకని ♦ దారుణతీక్ష్ణశరత్రయంబుచే
తను వెఱగందఁ జేసి బల♦దర్పసమగ్రుని నింద్రజిత్తు నొం
చెను శరపంక్తి, నాదనుజ♦జిష్ణుఁడు నయ్యెడ నద్భుతంబుగన్ ౨౬ 3991
మహాస్రగ్ధర —
బలవంతుండై రిపుస్త్రా♦వరుల నడఁచుచున్ ♦ పౌరుషోద్దాముఁడై యి
మ్ములఁ గాంతిం గ్రాలు నారా♦మునిసహజుఁడొగిన్ ♦ భూరిబాణాళిఁ గ్రుచ్చం
గలితక్రోధాత్ముఁడై ల♦క్ష్మణునిశరతతిన్ ♦ గాఢఁగా నంతరం బే
తలపోయన్ లేకయుండెన్ ♦ దదవసరమునం ♦ దాఁ బ్రయోగించెఁ బూన్కిన్.
సీ. సౌమిత్రియాబాణ♦జాలంబు తనునంటఁగా రాకపూర్వమే ♦ ఘోరబాణ
గణములఁ బరఁగించి ♦ ఖండించి యంతట నిలువక ధర్మైక♦నిశ్చలమతి
రథికవర్యుఁడు నయి ♦ రాజిలుచుండుట నానతపర్వమై ♦ యలరుభల్ల
మును వైచి యింద్రజి♦త్తునిసారథిశిరంబు ధరఁ బడఁ జేసెఁ;నం♦తటహాయములు
తే తమ్ముఁ దోలెడు సారథి ♦ ధరణిఁ బడిన
శిక్ష బలిమిని గలఁతను ♦ జెంద కల్లై

మండలాకారములఁ బోయి ♦ మహితరథము
ద్రిప్పె నది గనఁ జిత్రమై ♦ యొప్పె నపుడు. ౨౯ 3993

చ. అతిదృఢవిక్రముండయిన ♦ యారఘురామునిసోదరుండు త
ద్గతిఁ గని తీవ్రకోపమునఁ ♦ గప్పరు లెల్ల భయంపడంగ ను
ద్ధతిఁ దగ వానిగుఱ్ఱముల ♦ దారుణబాణములం గలంచె, న
ట్టితఱిని శక్రవైరియుఁ గ♦డింది బలంబున మించుచుండుటన్. ౩౦ 3994

క. తనరిపుఁ డొనరుచు కార్యం, బున కోర్వక తీవ్రకోప♦మును బూనిన యా
తని దశబాణంబుల నొం, చెను సర్పవిషంబుఁ బోలి ♦ చెలఁగి యురుదుగన్.

క. కులిశముతోఁ దుల్యములగు, నలఘుశరంబు లవి రుచిర♦హాటకకాంతిం
జెలఁగెడు లక్ష్మణు కత్తళ, ము లలిన్ స్పృశియించి విఱిగి ♦ భూమిం బడియెన్.

తే. రావణునియాత్మజన్ముఁ డ♦రాతి మేను
నందు భేదింపఁగా రాని♦యట్టి కవచ
మును ధరించినవాఁడని ♦ మనమునందుఁ
దలఁచి యత్యంతకోపంబు ♦ గలిగి యపుడు. ౩౩ 3997

క. పరమాస్త్రవేగమును నా, యరికిం గనఁబఱచుచున్ మ♦హాపుంఖములౌ
శరముల మూఁడింటను ద, త్పరతన్ గాఁడంగ నేసెఁ ♦ దన్నిటలంబున్. ౩౪

తే నిటలమున మూఁడుబాణముల్ ♦ నిలిచియుండ
సంగరప్రీతి గలుగు ల♦క్ష్మణుఁడు యుద్ధ
మునఁ ద్రిశృంగాద్రివడువునఁ ♦ గనఁబడియెను,
ఘోరసంగరమున నిట్లు ♦ క్రూరరిపుఁడు ౩౫ 3999

క. శరములఁ దనుఁ బీడింపఁగ, నురవడి జ్యాలతిక లాగి ♦ యురుమణిభాసుం
దరకుండలరుచిరంబగు, నరాతివక్త్రమున నాటె ♦ నైదుశరంబుల్. ౩౬ 4000

క శూరులు భీమపరాక్రము, లారాఘవసహజవాస♦వారులు దృఢమా
సారముగల విండ్లను గొని, భూరిశరంబులను వైచి ♦ పొంగెడు కాంక్షన్. ౩౭

క. నొంచిరి యొండొరులను, గడు, మించినశౌర్యమున వారు ♦ మేనులు నల్లన్
ముంచినయటు లొప్పుచుఁ బు, ష్పించిన కింశుకములట్లు ♦ చెలఁగిరి కడఁకన్.

చ. ఇరువురు చాపధారులయి ♦ యేపుమెయిన్ విజయంబుఁ గోరి యొం
డొరులను దారసించుచు మ♦హోగ్రశరంబుల సర్వగాత్రముల్
దురమున బాధనొందునటు ♦ తోరపుఁబూనిక గాఁడనేసి, రా
శరపతినందనుం డపుడు ♦ సంగరకోపముచేఁ బిశృవ్యనిన్ ౪౦ 4003

చ. కనుఁగొని చారువక్త్రమున ♦ గాఁడఁగ నేసెను మూఁడుబాణముల్,
దనుజలలాముఁ డింకను ని♦తాంతకఠోరశరత్రయంబు నా

జాలునొకకాంచవర్యముఁ ♦ జాపమందుఁ
బూన్కి సంధించె నలరంగ ♦ భూతతతులు ౭౭ 4026

సీ పత్రముల్ మంచివై ♦ భాసిల్ల వృత్తాంగమై సుపర్వంబయి ♦ యమలమయిన
సంస్థితి యొప్పంగ ♦ శాతకుంభవిచిత్రితంబయి యెట్టిభూ♦తంబు నైన
నంతం బొనర్పనై ♦ యతిదుర్నివారమై దుర్విషహ్యంబయి ♦ సర్వదాన
వులకు భీతిదమయి ♦ భూరిదారుణఫణివిషమట్లు తీవ్రమై ♦ వెలసి దేవ

ఆ సంఘపూజితమయి ♦ శరమది యొప్పను,, మున్ను దేవదనుజ♦ముఖ్యసంగ
రమున భూరితేజుఁ ♦ డమరేంద్రుఁ డాత్మవీ,ర్యమునశక్తి దనర ♦ నాశరమున.

క. దనుజుల జయించె, సమరం,బునను బరాజయము సుంత ♦ పొందనిదగు నా
ఘనబాణము నైంద్రాస్త్రం,బున నభిమంత్రించి పురుష♦పుంగవుఁడు క్రుద్ధన్

క వరధనువున సంధించెను,, ఒరసంఘవిదారణమగు ♦ వరబాణము విం
ట రయమునఁ గూర్చి లయమగు, తరుణంబున లోకముల వి♦దారింపంగన్

క. పనిఁబూని యున్న యమువలె, వినుతగుణం బెక్కుపెట్టి ♦ వెస దుర్ధర్షం
బనఁబడు శరాసనము వం,చి నియతిమై లాగె, నిట్లు ♦ [1]సిరి మెఱయంగన్

తే వెలయు నాలక్ష్మణుం డిట్లు ♦ విశిఖము పెను
ధనువునం గూర్చి కర్ణంబు♦దాఁక లాగి
తనదు కార్యంబు సాధింపఁ ♦ దగిన వాక్య
మున వచించెను బాణంబుఁ ♦ గనుచు నిట్లు ౮౨ 4031

[2]క శరమా! దశరథరాజు కొ,మరుఁ డారాముండు ధర్మ♦మతి సత్యపథ
స్థిరుఁడును బౌరుషమున నె,వ్వరునుం దనసాటిలేని ♦ వడువునఁ దగునే ౮౩

క ఈవాసవారి నీవిప్పు,డే వధియింపు, మని లక్ష్మి ♦ నెసఁగుచు విరుం
డై వఱలి వైరివీరుల,చేవ నడఁచు లక్ష్మణుండు ♦ చెప్పి నియతిమై ౮౪ 4033

ఆ. లక్ష్యమలర నాటి, ♦ శిక్షింపఁ జాలిన, యాశరంబు లాగి ♦ యైంద్రమైన
యస్త్రమంత్రయుక్త ♦ మా గతి సంధించి, వైచె నపుడు శక్ర♦వైరిమీఁద

చ శర మది కాంతిమంతమయి ♦ చక్క శిరస్కముఁ దాల్చి సత్ప్రభా
కరమగు కుండలద్వయము ♦ గ్రాలఁగ నొప్పెడు వాసవారిదా
శిరమును ద్రుంచి దేహమును ♦ జెందఁగ నీయక నేలఁ ద్రోచె, బం
గరువలెఁ జెల్వమీఱు నల ♦ కర్బుగుశీర్షవరంబు చయ్యనన్ ౮౬ 4035

చ తనువును వీడి రక్తమునఁ ♦ దద్దయుఁ దోఁగుచు ధాత్రిపైనచే
కనఁబడె, రావణాత్మజుఁడు ♦ కమ్రశిరస్కము కత్తళంబునున్
ధనువును దాల్చియుండి యవి ♦ ధ్వంసము కాఁగ హతుండునై జవం

1 లక్ష్మీవాన్ లక్ష్మణో వాక్యమ్-అనియూ 2 ధర్మాత్మా సత్యసంధశ్చ రామో దాశరథిర్యది, పౌరుషే చాప్రతిద్వంద్వ శ్శరైనం జహి రావణిమ్-అనియూ

బున ధరఁ వ్రాలె, న న్తత్క్షణిఁ • బూర్వము వృత్రుఁడు చావఁగా ముదం
బున సుర లార్చినట్లు కపి•పుంగవసంఘవిభీషణుల్ తమిన్ ౭౮॥ 4036

క. ధరఁ బగుల నార్చి, రంతట, సురలు మహాత్ములగు మౌని•సురనాథులు న
చ్చరలున్ గంధర్వులు న, న్తరుణంబున నార్చి రెలమి • తగ వ్యోమమునన్.

చ. దనుజవరుండు కూలుటయు • దానవసేన లోగిన్ జయంబునే
కను కపివీరు లట్టి తమ•కంబులఁ దమ్ము వధించుచుండఁగాఁ
జనియెను నాల్గుదిక్కులకు • సాధ్వసముం గని, వానరోత్తముం
దనుజులు పాఱిపోవఁ గని • తారును వెంటను బాఱి చంపఁగన్ ౮౦॥ 4038

ఆ. తాళలేక సంజ్ఞ • దప్పి యాయుధములఁ, బాఱవైచి లంకఁ • బట్టిపోయి,
రసురు లెల్ల భీతు•లయి పట్టసమ్ములఁ, బరశుఖడ్గముఖ్య•పరికరముల ౮౧॥

క. ధర వైచి శతములుగ న, న్తరుణంబున నిల్చి దెసలె • తమకుం దిక్కోఁ
బరికింప ననుచుఁ బాఱిరి,, హరిబాధితులైన కొంద • ఱసురులు భీతిన్

తే. లంకఁ జొచ్చిరి కొందఱు • లవణవార్ధిఁ
బడిరి కొందఱు దాఁగిరి • పర్వతముల
నింద్రజిత్తటు హతుఁడయి • యిలను గూలఁ
గనిన సురవైరు లందు నొ•క్కండు గాని ౮౩॥ 4041

క. కనుపట్టఁ డయ్యె వేలుగ, మునుపుండియు, భానుఁ డస్త•మును బొందఁగ నా
తనికాంతులు నిలువక యే,గునటులు తమనాయకుండు • కూలినమాత్రన్.

క. *పరుగెత్తిరి దిక్కులకున్,, గురుతేజుం డింద్రజిత్తు • కొంతవడి నిలం
బరిపరిఁ బొరలాడుచు సుర,వరలోకము నందఁ బోయెఁ • బ్రాణములు చనన్.

క. కిరణములులేని భాస్కరు,కరణిని నిర్వాణపావ•కక్రియఁ దేజం
బు రయమునఁ బోనఁ గూలెను,, సురరిపునాథాత్మజుండు • క్షోణిం బడినన్.

తే. పీడ లెల్లను నశియించెఁ • బృథ్వియందుఁ
బోయె నట్టు లరిష్టముల్ • పూషుఁ డెండఁ
గాయఁ జొచ్చెను, బాపైక•కర్ముఁ డింద్ర
జిత్తు తెగినంతఁ బాకారి • చెలఁగె మదిని ౮౭॥ 4045

క. మునులును సురలును హర్షం,బును బొందిరి, దుందుభిరవ•ముల్ నభమందున్
వినఁబడియె నచ్చరల న,ర్తనమున్ గంధర్వగాన•రమ్యధ్వనియున్ ౮౯

క. వినఁబడియెఁ, గ్రూరకర్ముఁడు, దనుజుఁడు హతుఁడైన దేవ•తలు సుమహర్షం
బును గురియించిరి లక్ష్మణు, వినుతించిరి చిత్రరీతి • వెలసె నదియునున్ ౯౦॥

* స బభూవ మహాతేజాః వ్యపాస్తగతజీవితః-అనియూ వ్యపాస్తో విక్షిప్తాంగో గతజీవితశ్చ-అని వ్యా॥

సీ. జలములు మిగుల ని♦ర్మలములై యొప్పెను దెలివొందె దెసకలది♦క్కులును దైత్య
దానవుల్ రోమాంచ♦ మూనిరి, సర్వలోకభయావహుండగు ♦ కర్బురుండు
హతుఁడైనయంతనే ♦ యప్సరల్ గంధర్వదానవుల్ చేరి య♦త్తఱినుండి
శాంతసంభ్రాంతులై ♦ స్వాంతహృష్టులు గాని విప్రోత్తముల్ ♦ మహినిఁ బ్రీతి

తే. మీఱ విహరింత్రు గాకని ♦ మించు వేడ్కఁ
బలికి, రంకెట హరిసైన్య♦పతులు శక్ర
వైరి మృతినొందఁ గని రఘు♦వరుని సహజు
ననుమబలుఁ గని కొనియాడి ♦ రతులనుతుల ౯౩ 4048

క. దనుజేజ్యుండు విభీషణుఁ, డనిలాత్మజుఁడై తనర్చు ♦ హనుమయు భల్లూ
కనివహపతియును విజయం,బును గంటి మటంచుఁ దమిసి♦బొంగుచు మదిలోన్.

క. కొనియాడిరి లక్ష్మణు నా,పనచరు లని జయమునంది ♦ వరుసగ సింహ
ధ్వనులం జేయుచు నార్చుచు, ఘనగర్జనముల చెలంగఁ♦గా లక్ష్మణునిన్.

క. పరివేష్టించుచు సేవిం,చిరి, కుఱియుం గపులు సంత♦సించుచు దోఁకల్
ధరణిం గొట్టుచు నార్చుచుఁ, గరములఁ దట్టుచును నెల్ల♦కపులు వినంగన్

తే. ఉన్నవాఁడు సర్వోత్కృష్ట ♦ ముల్లసిల్ల
లక్ష్మణుండని చాటిరి, ♦ ప్లవగు లంత
హర్షచిత్తంబు లొప్ప ♦ నన్యోన్య మొక్క
మొగి సమాశ్లేషకృత్యంబుఁ ♦ గ ఘటిల్ల ౯౭ 4052

క. పలుభంగుల లక్ష్మణుగాథలఁ జెప్పుకొనిరి, మహేంద్ర♦సన్యుఁడు తెగుటి
మ్ములఁ జారణాదు లొక్కటఁ, బలుకన్ విని హృష్టులయి సు♦పర్వులు మరలన్

చ. దనుజునిఁ జంప నెట్టులగు ♦ దారుణవిక్రముఁ డాతఁ డౌఁ గదా
యని యనుమానమొందిరి సుర♦ లాతని కేగి సుహానువీశుఁడై
తనరుచు నెల్లవారికిఁ ♦ దాను బిఱుసుగయి యొప్పు లక్ష్మణుం
డనితరసాధ్యమై ప్రజకు ♦ కంటకమౌ గడు ప్రాణహరంబునౌ
పని నొనరించుటం గనుచుఁ ♦ బర్విసి విస్మయచిత్తులై దివిన్ ౯౯ 4054

తొంబదియొకటవ సర్గము సంపూర్ణము

---

౯౨-వ సర్గము

[illegible]

క. అనుపమశుభలక్షణుఁడయి, తను [illegible] ♦ దడిసి [illegible]
ప్పిన లక్ష్మణుఁ డింద్రారిన్, ననిఁ జంప మహాముదంబు ♦ నాత్మం గనియెన్

క. విలసిత తేజోవీర్యం,బులఁ దగు లక్ష్మణుఁడు వాయు♦పుత్త్రుని భుజం

గ్యనియతిని ద్రెంచినట్లే, విను మితఁడే మంచియూఁత ♦ వీర! యతనికిన్

క. *హనుమద్విభీషణులు రణ,మున దుష్కరమైన కార్య♦మును జేసిరి నూ!
దనుజవరుఁడు వీరుండగు, మనవైరి త్రిరాత్రములకు ♦ మడియింపఁబడెన్.

తే. ఎట్టులో శ్రమ మొంది యీ♦యింద్రజిత్తు
చంపఁబడియెను గాన నీ♦సమయమందు
శత్రువులు లేనివానిగా ♦ నల్పితి నను
రావణుం డాత్మజుని చావుఁ ♦ దా విని వగ ౧౬ 4069

క. పెనుసేనలతో యుద్ధం,బునకున్ రాఁగలఁడు నుమ్ము, ♦ పుత్రవధను దా
విని తపియించుచు సంగర,మున నోర్వఁగ రాక మిగులు♦మూర్ఛనిఁబూన్కిన్.

క. ఘనసేనాపరివృతు నా,తని సంగరకాంక్షఁ బొదివి ♦ తప్పక మృతినిం
గనఁజేసెద, సౌమిత్రీ!, యని సాయము గోరఁదగిన ♦ యట్టిఁడవుగదా?. ౧౮

ఆ. అట్టి నీవు వాన♦వారి వధించుట
వలన నింకమీఁద ♦ వసుమతిసుత
ధరణిఁ బొందుటయనఁ ♦ దగు సులభంబుగా
ననియె, రఘువరేణ్యుఁ ♦ డాదరమున. ౧౯॥ 4072

చ. అనుజుని నిట్టు లూఱడిలు ♦ నట్టు లొనర్చుచుఁ గౌఁగిలించి నె
మ్మనమున సంతసం బొదవ ♦ మాన్య సుషేణునిఁ బిల్చి పల్కె, నీ
వనఁగఁ జికిత్సలో ఘనుఁడ ♦ వౌదు సుహృజ్జనవత్సలుండు నా
యనుజుఁడు లక్ష్మణుండు రణ♦మందున దేహము నింగ శల్యముల్. ౨౦

తే. తగిలియుండుటచేత బా♦ధలను గుందు
చున్నవాఁ డితఁ డిబ్బాధ ♦ యుడిగి యెట్లు
సుఖముగా నుండునో యట్టి ♦ చొప్పునఁ గడు
యత్నమునరఁ జికిత్స చే♦యుంగవలయు ౨౧॥ 4074

సీ వేగ సౌమిత్రివి♦భీషణులకు మేనఁగలశల్యములఁ దీయ♦వలయు శూరు
లయి తరువులఁ గొని ♦ మనిచేయు భల్లూకవానరభటులకుఁ ♦ గాని యితరు
లెవరెవ రనిచేసి ♦ యిప్పు డమ్ములు గ్రుచ్చుకొన గండ్లు పడుటచేఁ♦గుందువారొ
వారికందఱికిని ♦ వరుసఁగా వేవేగ యత్నంబునన్ సుఖ ♦ మలరఁ జేయు

తే. మనియె, నీరీతి రాఘవుఁ ♦ డనువదింపఁ
గా మహాత్ముఁడు కపియూథ♦కాంతుఁ డాతఁ
డప్డు లక్ష్మణునాసిక♦యందు నుంచి
యోషధిని బెట్టి వాసన ♦ యొప్పఁ జూపె ౨౩॥ 4075

క. దానినువాసనచేతన్, మేనునమును నాటియున్న ♦ మేటిశరములున్

* అహోరాత్రై స్త్రిభి ర్వీరః కథం చి ద్వినిపాతితః-అనియూ.

గానఁబడవయ్యె వేదన, మానెఁ గాయములు పూడి ♦ మై తనరారెఁ. ౨౪

తే. అనుషేణుఁడు శ్రీరాము♦నాజ్ఞ నంత
నవ్విభీషణుఁ డాదిగా ♦ నఖిలసఖుల
కగచరోత్తమపంక్తికి ♦ నాదరమునఁ
దాఁ జికిత్స నొనర్చె ను♦త్తమపథమున. ౨౫ 4077

క. హృతశల్యుండయి క్షణమున, గతదేహజ్వరుఁడునయి వి♦గతహృద్వ్యథుఁడై
యతులితముద మందెను రా,ముతమ్ముఁ డత్తరుణమందు ♦ ముందటిరీతిఁ. ౨౬

క జనపతియును సుగ్రీవుం,డనఘుండు విభీషణుండు ♦ నఖిలర్క్షవరుం
డన నెగడు జాంబవంతుఁడు, వనచరులును లక్ష్మణునకు ♦ బాధ లడంగఁ.

క కని యాతఁడు మోదంబును, గని లేచుట కలరి, రంత ♦ గాకుత్స్థవరుం
డును దుష్కరమగు రావణు,తనయు వధంబును నొనర్చి ♦ తనరుటకు ముదిఁ.

ఆ సంతసించి యతనిఁ ♦ జక్క బహూకరిం,చెను బ్లవంగబలప♦తిని కరములు
శక్రవైరిమృతికి ♦ సమధికప్రీతిని, గాంచి కేళి సల్పె ♦ నంచితముగ ౨౯

తొంబదిరెండవ సర్గము సంపూర్ణము.

---

## ౯౩ - వ సర్గము.

ఇంద్రజిత్తు మృతికై రావణుఁడు విలపించుట.

క. అంతట దానవవరుని ని,శాంతంబున నున్న యతని♦సచివులు తొలుతఁ
వింతపడఁ జాలు రావణి,యంతంబును విని కడింది ♦ వ్యథలం గనుచుఁ. ౧

క. దనుజేంద్రునకుం దెలుపం,గను బూని మహాసురేంద్ర! ♦ కడుఁదేజమునం
దనసాటిలేని నీతన,యు నింద్రజిత్తుని మహాత్ము ♦ యుద్ధమునందుఁ. ౨ 4083

క. మేమెల్లఁ జూచుచుండఁగ, రామానుజుఁ డతులమహా ప♦రాక్రమము దగం
గా మన విభీషణుని యు,ద్ధామనసాయమునఁ జంపె ♦ దానవనాథా! ౩ 4084

క. అని సపజయమన్న నెఱుం,గని శూరుం డింద్రజిత్తు ♦ కలహంబున న
ట్టి నరపతితనూజునితో, నని యొనరిచి నిహతుఁడయ్యె ♦ నాశ్చర్యముగఁ. ౪

చ. సురపతినిఁ జయించి రణ♦శూరుఁ డనం బొలుపొంది మించు నీ
వరతనయుండు లక్ష్మణుని ♦ బాణములం దపియింపఁ జేసి తాఁ
బరమములైన లోకముల ♦ వాసముచేయఁగఁ బోయె, నన్నని
ర్జరరిపునాయకుండు రణ♦రంగమునం దనపుత్త్రుఁ డిమ్మెయిఁ. ౫ 4086

ఆ. చంపఁ బడియె నన్న ♦ సాధ్వసప్రదమయి
యక్కటా! యటంచు ♦ ననఁగఁ జాలి

దారుణమయి యున్న ♦ తనయుని మృతివార్త
విని నయంత మూర్ఛ ♦ మునిఁగె మిగుల. ౪ 4087

చ. దనుజవరుండు పుత్రుని వ♦ధంబున మున్గిన మూర్ఛనుండి చా
లనిధృతిఁ జాలసేపటి కి♦లాస్థలిపైఁ బడియున్న దేహ మొ
య్యనఁ గదలించి లేచి తన♦యాత్మజశోకము తీవ్ర వేదనం
గనునటు చేయ సింద్రియని♦కాయము తత్తఱమంద నేడ్చెఁ దాన్. ౫ 4088

తే. అక్కటా! దానవబలము♦ఖ్యా! మహాత్మ!
ప్రియతనూజ! మహారథా! ♦ పెంపుగల్గు
నమరనాయకుని జయించి♦నట్టి నీవు
మనుజుఁడగు లక్ష్మణుని చేత ♦ మ్రంది నావె?. ౬ 4089

[1]క. తనయా! నీవే క్రోధం,బున గాంచిన యెడల విశిఖ♦ముల నంతకుఁ గా
లుని మందరశృంగములను, గనుమూసినయంతలోనఁ ♦ గడ తేర్తుగదా? ౭

క మనుజుని లక్ష్మణుఁ జంపుదు,వని చెప్పఁగవలెనె, మఱియు ♦ నాయతబాహూ!
విను మిపుడు నీవు మృతినిం,గని యమునిం జేరినావు ♦ గావున నతఁడున్ ౮

క అతిశయబంధువుఁ డయ్యెన్,, మృతి సంగరమందుఁ గనుట ♦ మించెడు శూర
ప్రతతికి సమ్మతమగు పద్ధతియే [2]సురవారమునకుఁ ♦ దగినది యిదియే. ౮

చ కనుక రణంబునం దెగుట ♦ కమ్రపథంబగు శూరపంక్తికిన్
మనమునఁ గోరఁగాఁ దగిన ♦ మార్గము దీనికి శోకమంద, నే
జనుఁ డని స్వామికార్యమును ♦ సల్పి హతుండగు నాతఁ డొందు సు
మ్మనితరసాధ్యనాకమును ♦ నట్టిఁడవౌటను శోక మేటికిన్ ౯ 4093

క. మునివర్యులు సురగణములు, ఘనులౌ దిక్పాలకులును ♦ గ్రవ్యాదవరుం
డనిఁ దెగియె నంచు విని నె,మ్మనములఁ గలభీతినెల్ల ♦ మాని సుఖంబున్ ౧౦

క కని సుఖముగ నిద్రింపం,గను గల, రిత్తఱుణమున జ♦గత్త్రయమును గా
ననసహితధరామండల,మును నా పుత్రకుఁ డొకండు ♦ భూమి వడలినన్ ౧౧

ఆ శూన్యములుగఁ దోఁచు♦చుం గనఁబడకున్న
వకట! యింక దనయుఁ ♦ డంత మొంద
నంతిపురమునందు ♦ నసురాంగనలయార్త
రవము లోక్కరీతి ♦ వివిధగతుల ౧౨ 4096

క వినఁగలను శైలగుహాలం, దినూనయూథేశమృతికి ♦ నాఁడు గజంబుల్
పనివెడు నార్తరవంబుల,యనవున నీఁక నేమిచేయ ♦ నగు నా కకటా! ౧౩

1 నను త్వమిషుభిః క్రుద్ధో భింద్యాః కాలాంతకా వపి-అనిమూ కాలాంతకావుమస్య మూర్తిభేదౌ-అనిగోవిందరాజులు కాలః సర్వసంహారకః అంతకః. కాలాభిమానీ పురుషః-అనిమహేశ్వరతీర్థులు 2 సర్వామరగణో ష్వపి-అనిమూ

క. అరిసూదనా! సురారుల, పురమును రాక్షసుల నన్నుఁ ♦ బొగిలెడుతల్లిన్
దరుణీమణియగు భార్యను, నరుదగు యువరాజపదము ♦ నఖిలధనములన్. ౧౩

క విడనాడి యెచటి కేగితి, కొడుకా! విక్రమధనాఢ్య! ♦ క్షోణిస్థలినిన్
విడిచి యమాలయమునకున్, వడి నే నేగంగ విధిగ ♦ భక్తి మెఱయఁగన్

ఆ ప్రేతకార్యములను ♦ ఖ్యాతిఁ జేయంగను, దగినవాఁడవుగక ♦ తనయ! యట్లు
గాక వ్యత్యయమ్ము ♦ గా నొనరించితే, నేను జేయునట్లు ♦ నీకు నిపుడు. ౧౪

చ తనయవతంసమా! మునుపు ♦ తద్దయు నామదిఁగల్గు శల్యరా
జిని దొలఁగించు నీవిపుడు ♦ చిత్రముగా నలరామలక్ష్మణుల్
వనచరనాయకుండు మది ♦ వారని శల్యములౌచునుండఁగాఁ
జనితివె వానిఁ బుచ్చకయె ♦ చయ్యన మమ్మిట వీడి యక్కటా! ౧౫ 4101

చ అని యిటు పెక్కురీతుల ను♦హార్తిని బొక్కెడు రాక్షసేంద్రు, నె
మ్మనమునఁ బుత్రుచావు వగ ♦ మైకొన మిక్కిలి క్రుద్ధుఁడయ్యె, నా
వనజహితుండు నైజముగ ♦ వాఁడికరంబులు గల్గువాఁడె యా
తనిని నిదాఘమందు బహు♦దారుణమూర్తినిగాఁ గరంబు లో
యైన నొనరించునట్లు సుతు♦నంతము కోపనుఁడైన రావణున్. ౧౬ 4102

తే మఱియుఁ గుపితుని జేసె, న♦ త్తఱిని నతని
ఫాలములఁ గూడు బొమముడుల్ ♦ ప్రళయమందు
వననిధిని నక్రములపొందు ♦ గనినయలల
వలెఁ బ్రకాశించె నెంతయు ♦ భయదములయి ౧౮ 4103

సీ ఆతండు క్రుధచేత ♦ నావులింపఁగ వానివదనంబునుండి పూ♦ర్వము భయంక
రాకారుఁడౌ వృత్రు♦నాస్యమునుండి బయలుదేరినట్టు ల♦త్యంత తేజ
మున మండుచున్ ధూమ♦మునవొప్పు నగ్ని వెల్వడియె, నాతఁడు పుత్ర♦వధముచేత
సంతప్తుఁడై శూర♦సముదయవస్యుఁడయ్యును క్రోధవశమున ♦ మనమునందు

తే నెంచి సీతను జంపంగ ♦ నిచ్ఛగించెఁ,
బ్రకృతిచేతనె యెఱ్ఱనై ♦ పరఁగునతని
కన్నులత్తఱి కోపాగ్ని♦కలితములయి
మిగుల భయదంబులై మండె ♦ మించురుచుల. ౨౧ 4104

చ అనవరతంబు ఘోరమగు ♦ నాతని యాకృతి క్రోధవహ్నిచే
తను మఱితీవ్రమై క్రుధను ♦ దాల్చి రుద్రునిఁబోలినట్లు చెం
తనయునఁ జేరరాక తగె, ♦ దైత్యవరేణ్యుఁడు క్రుద్ధుఁడౌట నా
తనినయనాళినుండి బహు♦దారుణరీతిని జూడ నొప్పుచున్. ౨౨ 4105

---

పుత్రస్య పున రాధయః, చిత్తం సందీపయామాసు స్సైక్తె ఉల్కా ఇవ రశ్మయః-అనిమా,

తే. మండు దీపయుగంబున ♦ నుండి జ్వాల
తోడనే తైలబిందుసం ♦ దోహము పడు
నట్టు లనలంబుతోఁగూడ ♦ నశ్రుబిందు
వులు ధరంబడెఁ బలువిధం ♦ బులుగ నపుడు ౨౩ 4100

ఆ. అతఁడు పండ్లు గొఱుకు ♦ నప్పుడు కడురవ, ముద్భవించి దనుజు ♦ లురుతరఘట
యంత్ర మట్టె త్రిప్పు ♦ నమరునిస్వనమట్లు, వినఁగఁబడుచునుండె ♦ విततమగుచు.*

క. పెనుకోపంబున లయవ,హ్నినిబోలిన రావణేశుఁ ♦ డేయే దిశలం
గనునో యందందుం గల,దనుజులు భీతాత్ములగుచు ♦ దాఁచుకొని రటన్. ౨౫

క. పరమక్రుధఁ బ్రళయంబునఁ, జరాచరంబుల హరింపఁ ♦ జాలఁదలఁచు భీ
కరయముఁ బోలుచు దిక్కులఁ, బరికించెడునతనికడకు ♦ భయపీడితులై. ౨౬

చ. దనుజులు పోవరైరి, కడు ♦ దర్పసమగ్రుఁడు రాక్షసేంద్రుఁ డా
త్మను గ్రుధఁ బూని భీతులగు ♦ దానవులం బురికొల్ప నెంచి యి
ట్లనియెఁ దదంతరంబున, స ♦ హస్రశరత్తులు దుష్కరంబుగాఁ
గనఁబడునట్లుగాఁ దప మ ♦ ఖండవిభూతిని జేసి భక్తిచేన్ ౨౭ 4110

ఆ. నడుమ నడుమ నియతి ♦ నుడిగెడు తఱి బ్రహ్మ, వలరఁ జేసినాఁడ, ♦ నాతపంబు
కలిమి బ్రహ్మ కరుణ ♦ వలన నాకున్ భీతి, యసురసురలవలనఁ ♦ బొసఁగదెపుడు.

చ. వనజభవప్రదత్తమయి ♦ వారిజమిత్రునిరీతి వెల్గు చ
క్కనికవచంబు నాకలరుఁ ♦ గా యది నిర్జరదానవాళితో
నని నొనరించునప్పుడు మ ♦ హాకులిశాయతశక్తిపంక్తిచే
తను జెడదయ్యె, నాకవచ ♦ శల్లజమున్ ధరియించి యుబ్బునన్. ౩౦ 4112

చ. అరదము నెక్కి యుద్ధమున ♦ కాయితమై యరుగంగ నన్ను నె
వ్వరు రణవాంఛ మార్కొనఁగ ♦ వత్తురు? తానె పురందరుండు సం
గరమున మార్కొనం గలఁడె, ♦ కర్బురులార సురాసురాళితో
దుర మొనరించుచుండ మును ♦ తోయజసూతియె సుప్రసన్నుఁడై. ౩౨

చ. శరములతో శరాసనముఁ ♦ జాలమహత్తరమైనదాని నా
శరవర! కొమ్మటంచుఁ గృప ♦ సంధిల నిచ్చెను, రాముఁ బత్సహో
దరునిని జంపుకోసమె ని ♦ తాంతభయంకరచాపవర్యమున్
ద్వరపడి దానిఁ దూర్యశత ♦ నాదము లొప్పఁగఁ దెంపు పొందనేన్ ౩౩

ఉ. పోరుఁడు రావణుండు తన ♦ సూనువధంబునకై తపించుచున్
భూరితరాగ్రహంబు మదిఁ ♦ బూనుచు లోనఁ దలంచి యప్పుడా
సారసనేత్ర రాఘవుని ♦ సాధ్విని జేరఁ దలంచె, సంతతన్
ఘోరతరస్వభావుఁ డతి ♦ ఘోరతనుండగు దానవేంద్రుఁడున్ ౩౪ 4115

---

* యంత్రస్యావేష్ట్యమానస్య-అనిమూ యంత్రస్య ఘట యంత్రస్య దానవైరాపీడ్యమానస్య భ్రామ్యమాణస్య-అనివ్యాఖ్య.

క కనులెఱ్ఱఁగఁ గోపంబునఁ, గనఁబడ దీనుండు నగుచుఁ ♦ గ్రవ్యాదు లొగిన్
దనయెదుట దీననిస్వనమునఁ బల్కఁగ వారిఁ గాంచి ♦ మూఢతఁ బలికెన్

సీ. *నాముద్దుతనయుండు ♦ నాకేశజిత్తు వానరుల వంచింప మ♦నమున నెన్ని
మాయచే సీతను ♦ నాయెడఁ గల్పించి వధియించి యారిత్త♦వస్తువుఁ గొని
యిదియె మీసీతయం ♦ చెల్లవానరులకుఁ గనఁబఱచినవాఁడు, ♦ గాని నేను
క్షత్రబంధుండగు ♦ క్ష్మాపతి ననుసరించినదయి యున్న యా♦సీత నిపుడె
హత మొనరించిన ♦ నదియ ప్రియంబగు నాదునాత్మకును దా♦నవులకనియె,

తే. నిట్లు సచివులతోఁ బల్కి ♦ యేపుమీఱ
ఖడ్గ మంకించె వేగంబ, ♦ కర్బురేంద్రుఁ
డాత్మజునిశోకమున మది ♦ యాకులమయి
యుండ నతిశయకోపంబు ♦ నొంది యపుడు. ౩౯ 4117

చ. అనుపమపుష్పమాలికల ♦ నందముగాఁ దగి నిర్మలాంబరం
బునఁ దనరారు ఖడ్గమును ♦ నాత్మకరంబున నెత్తికొంచు మం
త్రినికరయుక్తుఁడై తనస♦తీమణు లెల్లను దోడరాఁగ వే
చనియెను సీత యున్నెడకు ♦ సాహస మూని భయంకరాకృతిన్. ౪౦ 4118

చ దనుజులు రావణుండు చనఁ ♦ దారును సింహరవంబు లొప్ప నా
తనిమది కోపమూనిన వి♦ధంబును గాంచి యిఁకన్ జయించు నీ
యని నని యుబ్బి యొండొరుల ♦ నాదృతిఁ గౌఁగిటఁ జేర్చుకొంచు ని
ట్లనుకొని, రీమహాత్ముని భ♦యంకరరూపముఁ గాంచి యెంతయున్ ౪౧ 4119

ఆ. భీతి నొందఁ గలరు, ♦ ఖ్యాతి నొందినయాతఁ
డఖిలలోకపతుల ♦ నని జయించి
నాఁడు గాదె? బహుర♦ణంబులఁ బెక్కుశా
త్రవులఁ జంపలేదె ♦ దర్పమలర ౪౨ 4120

క. లోకత్రయరత్నంబులఁ, బ్రాకటతరశక్తిఁ దెచ్చి ♦ వరభోగములిం
పౌ కరణిఁ బొందుచున్నాఁ, డీకర్బురనాథుశౌర్య ♦ మీతనిబలమున్. ౪౩

క. ధర నెవ్వరికిం గలు, దని, సురరిపులు పరస్పరంబు ♦ సొరిదిం బలుకన్
గరము క్రుధన్మై తెలియమిఁ, బరుగెత్తె నశోకవనికిఁ ♦ బడఁతిం గనఁగన్

చ తనకుశలంబుఁ గోరుసఖి♦తల్లజు లెంతని యూని చెప్పినన్
వినక మహాగ్రహంబుఁ గొని ♦ వేగ కుజుండు నభస్థ్సలంబునన్

* తి దిదం తథ్య మే వాహం కరిష్యే ప్రియ మాత్మనః, వైదేహం నాశయిష్యామి క్షత్రబంధు మనువ్రతామ్-అనిమూ వా స్తవార్థము క్షత్రియుఁడగు రమాప్తుఁడగు శ్రీరాము ననుసరించిన సీతను నిజముగాఁ జంపినయెడల నది నాకప్రియమే దానవుల కది ప్రియము కాన నట్లు కనఁబఱచెదనని రామానుభాష మని తీర్థులు పద్యమున "అది అప్రియంబగు" నని పదవిభాగము చేసిన నాయర్థము తేటపడును అదియప్రియంబని సామాన్యార్థమున విభజించుకొనఁ దగు

ఘనతరకోప మూని కడుఁ ♦ గాఱియపెట్టెడు వేడ్క రోహిణిం
గనఁ జనునట్లు సీతకయి ♦ క్రన్నఁ బోయి మహోగ్రరూపుఁడై ౫౬॥ 4123

తే. రాక్షసాంగనలుం దను ♦ రక్షణంబు
చేయ నిందింపఁ దగని యా♦క్షితితనూజ
క్రుద్ధుఁడై వేటిఖడ్గంబుఁ ♦ గొని జవమున
నరుగుదెంచు రావణుఁ గాంచె ♦ నార్తి గదుర ౫౭॥ 4124

చ కరమున ఖడ్గ మూని తన♦గాదిలిమిత్రులు పెక్కురీతులన్
దరుణి వధింపఁ గూడదని ♦ తన్ను గుఱించి వచించుచున్న నా
దర మొకయింత లేకసుర♦తల్లజుఁ డెంతయుఁ బూన్కి రాఁగ నా
ధరణితనూజఁ గాంచి మదిఁ ♦ దద్దయు భీతిలి వంతఁ గుందుచున్ ౫౮ 4125

క విలపించుచు నిక్కరణిం, బలికెన్, దుర్మతి యితండు ♦ పటుకోపమునన్
గలఁగుచుఁ బరుగిడుచున్నాఁ, డలాతమటు గాన రాక్ష♦నాధిపుఁ డిచటన్.౫౯॥

సీ. నను సనాధను ననా♦థనుబోలె వధియింపనున్నాఁడు, భర్తను ♦ సన్నుతముగ
ననుసరించెడునన్నుఁ♦గని "నాకు భార్యవు గమ్ము రమింపుమా♦కరుణ"ననుచుఁ
బలువిధంబులఁ బురి♦కొలిపి నిరాకృతుండయ్యె నిశ్చయముగ, ♦ నట్టివీఁడు
నేను గైకొనమిచే ♦ మానసంబున నిరాశనుబొంది యాగ్రహం♦బునువిమోహా

తే. మును బయికొనఁగ ననుఁ జంపఁ♦గను బ్రయత్న
ముననె వచ్చినవాఁ డిద♦గును ధ్రువంబు,
కత్తి చేఁబూని వచ్చుటల్ ♦ కనఁగ వీఁడు
పురుషసింహుల నాసహో♦దరుల ఘనుల ౬౦॥ 4127

చ. అనిమొన రామలక్ష్మణుల ♦ నారసి నాకొఱకై వధించువే
డ్కను గొనివచ్చెనేమొ? యక♦టా! యలరాట్సుతు లస్మదర్థమై
గనుదురొ యేమొ మృత్యువును, ♦ గంటినె నాయటువంటిదాని సీ,
మనమునఁ బాపనిశ్చయము ♦ మానని రౌద్రుఁడు వీఁడు గావునన్ ౬౧॥

క. తనయునిఁ గూర్చినశోకం,బున రాము సుమిత్రతనయుఁ ♦ బోకార్పఁగ లే
క నను వధింపఁగ బూనునొ?, హనుమంతుం డపుడు చెప్పి♦నట్టి పలుకులన్

క. మనమున నాలోచన చే,యను జాలని దానఁగాన ♦ నాత్మహితము లే
తని నుడులని వినకైతిని,, ననిందితను నేను నప్పు ♦ డనిలజునుడులన్ ౬౨

క విని యతనివీఁపు నెక్కియె, చనియుండిన నాఘఁ జేరి ♦ చక్కసియంకం
బున నుండుఁ గాన దుఃఖం,బును దీనిం బొందకుండుఁ ♦ బో, యదితప్పెన్

చ. అనిమొన రాక్షసేంద్రహతుఁ ♦ డయ్యెను రాముఁ డటంచు విన్నచోఁ
దనయుఁ డొకండె యాట వని♦తానుణి కోసలరాజపుత్రి యే

వనటఁ గృశించునో యిచటి ♦ వార్తయె గుండెఁ బగుల్చు నంచు నా
మనమున నెంచెదర్, మఱియు ♦ మానితశీలుని రాముజన్మముర్. ౫౬ 4132

తే. బాల్యమును యౌవనంబును ♦ బరమధర్మ
కార్యముల కనురూపమై ♦ క్రాలుసత్వ
భావమును నాత్మఁదలఁచి యే♦వ్వఁగలదామె,
మఱియుఁ గౌసల్య పుత్రుని ♦ మరణము విని. ౫౭ 4133

[1]క. స్మృతితప్పినదై శ్రాద్ధం, బతనికి నొనరించి తనయు♦నాశ వదలి వే
హుతవహునియందొ జలనం,యుతకూపమునందొ వొచ్చు♦నూహానిజ మదా.

తే. కుబ్జమంథర! యిస్సిరో ♦ కూలిపోవు
గాక, పాపమునందె ని♦క్కముగ మనసు
గలిగి దుర్మార్గురాలయి ♦ వెలయుదాని
వలననే యత్తగారికిఁ ♦ గలిగె వెతలు. ౫౯ 4135

చ అని విలపించుచుర్ సరసి♦జారిని బాసి కుజగ్రహంబుచే
తను గడుఁ జిక్కి చింతిలెడు ♦ తారను రోహిణిఁ బోలి యక్కటా
యనఁదగియున్నసీతఁ గని ♦ [2]యంతట రావణుమంత్రి చిత్తశు
ద్ధినిదగువాఁడు సంతతమ♦తిస్థిరతం దగువాఁడు ధీరుఁడుర్ ౬౦ 4136

తే. మఱియు మేధావియును నయి ♦ మహిఁ బ్రసిద్ధుఁ
డౌ సుపార్శ్వుఁడు సచివు లి♦య్యది యసమయ
మనుచు వారించుచుండినఁ ♦ జని దశాస్యు
నంతికముఁ జేరి యతనికి ♦ ట్లనియెఁ బేర్మి ౬౧½ 4137

క దనుజేంద్రా! సాక్షాత్తుగ, ధనపతికిర్ సోదరుఁడవు ♦ ధర్మవిదులలో
ఘనుఁడవు నీవిటుధర్మం,బును బాడొనరించి క్రోధ♦మునకుర్ లోనై. ౬౨

క జనకజ నెట్లు వధింపర్, మనమునఁ గోరెదవు? ♦ వీరమండన వేదా
ళిని నేర్చి విద్యలందుర్, ఘనపాండితి గలిగి మఖము♦ఖస్నాతుఁడవై ౬౩ 4139

క. హితకర్మనిరతుఁడవె యై, క్షితివిస్తృతమైన ఖ్యాతిఁ ♦ జెలఁగెడు నీకీ
యతివను జంపుతలం పే,విధమునఁ గల్గినది? దనుజ♦వీరవతంసా!. ౬౩½ 4140

చ. జనకజ చాలరూపవతి ♦ సన్నుతశీలయుఁ గాన నీవశం
బున నీఁక నుండునట్టి విధ♦ముం దలపోయుము నీదుకోప మా
జనపతియందె చూపు, మిదె ♦ సర్వసురారిమహేంద్ర! నేఁడు నీ
వని నొనరింప సిద్ధమగు ♦ నట్టిప్రయత్నము చేయఁగాఁ దగుర్ ౬౪½ 4141

సీ అసితపక్షంబిది ♦ యందుఁ జతుర్దశియగుఁగదా! నేఁడు ప్ర♦యత్నమునకు
మంచిది రేపేయ♦మావాస్యయగు నందు సకలవాహినులతోఁ♦జక్కఁగూడి

1 నిరాశే నిహతే పుత్రే దత్వాశ్రాద్ధ మచేతనా-అనియూ 2 అమాత్యో బుద్ధిమాన్ శుచిః, సుపార్శ్వో నామ మేధావీ రాక్షసో రాక్షసేశ్వరమ్-అనియూ.

విజయమొందుటకయి ♦ వెడలుము, [1]శూరుండవై బుద్ధిమంతుండ♦వై మహారథుఁడవయి ఖడ్గివై ♦ తేరంపురథ మెక్కి దశరథసూనువ♦ధమున నీవు

తే. జనకతనయాకృపంగనఁ ♦ జాలు దిట్టు
లిపుడు సీతను జంపిన ♦ నేమి ఫలము?
నాఁగ దుర్మతి వీర్యాఢ్యుఁ♦డై గరోరుఁ
డైన యారావణుఁడు సుపా♦ర్శ్వాఖ్యుఁ డిట్లు ౬౬ 4143

ఆ మిగుల ధర్మయుక్త♦ముగఁ బల్కు నమ్మాట, నాదరించి యింటి ♦ కరిగి యంత
సచివయుక్తుఁ డగుచుఁ ♦ జనియె సభామండ,పమున కేమిచేయ ♦ బాగటంచు.

తొంబదిమూఁడవ సర్గము సంపూర్ణము

౯౪ - వ సర్గము

-రాముఁడు మూలబలంబులఁ జంపుట.-

క. దనుజవరుం డారావణుఁ, డనుపమసభఁ జేరి దీనుఁ♦డై కడు వగతో
డను గ్రుద్ధసింహము ట్లా,యనుపమసింహాసనమున♦యం దొకరీతిౘ ౧ 4145

తే. కూరుచుండె నిట్టూర్పులు ♦ గూడఁ బర్వ,
నంతటి మహాబలుండగు ♦ నసురవర్యుఁ
డాత్మభవదుఃఖకర్శితుం♦డై బలాధి
పతుల నూఱడిలం జేయు ♦ మతినిబూని. ౨ 4146

[2]క కరముల జోడించుచు ని,క్కరణిం బలికెౘ, సమస్త♦గజహయములతో
నరదంబులతో వీరని,కరములతో మీర లెల్లఁ ♦ గదలుం డనికిౘ. ౩ 4147

ఉ. మీరలు రాము నొక్కనిని ♦ మించెడుప్రానికిఁ జుట్టుముట్టి గం
భీరఘనాళి వృష్టితఱిఁ ♦ బెద్దగ వృష్టి నిగుడ్చునట్టు లా
సారముగాఁగ బాణములఁ ♦ జయ్యనఁ జంపుఁడు, కాకయున్న నా
భూరమణాంగముౘ సమర♦భూమిని దీక్ష్ణశరాళిఁ జీల్చెనౘ. ౪ 4148

తే. హీనబలుఁడగు నారాము ♦ నెల్లి లోకు,లెల్లఁ జూచుచునుండఁగ ♦ నేవధించు
వాఁడ, నని పల్కుచున్న రా♦వణునిమాట,లాలకించి వేచనుస్యంద♦నాళి నెక్కి,

క. పలువిధములైన తమబల,ములు వెంబడిరాఁగ యుద్ధ♦మున కేగిరి, వా
రలు దేహమ్ముల మాపెడు, బలుసాధనములను బరిఘ♦పట్టసములనుౘ ౫

క. శరఖడ్గపరశ్వథముల, హరివీరుల మీఁద వైచి, ♦ రావనచరులుం
దరువులఁ గొండలఁ గొని ని,ర్జరవైరులపై నవైచి ♦ రయము మెఱయఁగౘ.

---

[1] హత్వా దాశరథిం రామం భవాౘ ప్రాప్స్యసి మైథిలీమ్-అనిమూ దశరథసూనువధమున-రామకృతమరణమున ననఁగా రామునిచే నీవుచంపఁబడి రాముని మైథిలిని బొందఁగలవు వారిసేవకుఁడవు కాఁగలవని వాస్తవార్థమని మహేశ్వరతీర్థులు. 2 రావణః ప్రాంజలి ర్వాక్యమ్-అనిమూ,

తే. ఉరవడించిరి, భాస్కరు♦నుదయ మాది
గాఁగ వనచరరాక్షస♦గణములకును
నమ్మహాయుద్ధ మధికభ♦యంకరముగ
సాగఁగాఁ జొచ్చెఁ ద్రిదశు లా♦శ్చర్య మంద. ౯ 4152

సీ. వనచరరాక్షస♦వరులు పరస్పర మతివిచిత్రములగు ♦ నట్టి గదలఁ
బ్రాసఖడ్గములఁ బ♦రశ్వధమ్ముల గిరితరువులఁ గొట్టుకొ♦ని, రిటు వార
లకుమహాయుద్ధంబు ♦ సకలభూతభయంకరముగ సాగఁగ భూరి♦రజము రేఁగ
నద్దిరక్తప్రవా♦హమ్మున శాంతించెఁ, గుంజరస్యందన♦కూలములుగ
తే హయములే మత్స్యములుగ ధ్వ♦జాళివృక్ష
ములుగ దేహంబు లెల్లఁ దె♦ప్పలుగ రక్త
నదులు ప్రవహించె, నంతన♦నచరు లెల్ల
శోణితాపగలం దోఁగు♦చుఁ రణమున. ౧౧ 4153

చ. ధనుజులవక్త్రకేతనవి♦తానములన్ రథవాజిభూరిసా
ధనముల బల్మిమై నెగరి ♦ తద్దయు దూఁకుచుఁ బైకి నేగుచున్
గనుఁగొనఁ జిత్రమౌ విధము♦గా నటఁ బాడొనరించి, రంతటం
జనక హరీశ్వరుల్ దనుజ♦సంఘశిరోరుహకర్ణ భాలముల్. ౧౩ 4154

తే. నాసికలనొగిఁ దీక్ష్ణదం♦తములఁ గొఱికి
గోళ్ల గీఱియుఁ ద్రుంచిరి, ♦ కోఁతు లొక్క
దనుజునిన్ నూర్గు రేసి మా♦ర్కొనుచు ఫలన
హితమహీజముఁ బక్షుల♦వితము తోఁప. ౧౪ 4155

తే మునరి పోరాడి, రంతట ♦ వెన గిరీంద్ర
సదృశదేహులు రాక్షసుల్ ♦ సాధ్వసకర
ములయి పెద్దగనున్న గ♦దలను ఖడ్గ
ములను బ్రాసపరశ్వధ♦ములను బూని. ౧౬ 4156

క. వచరులం బ్రహరించిరి,, దనుజావళి యిట్లు చంపఁ ♦ దాళఁగ లేమిన్
జని వే రక్షకుఁడగు రాముని మఱుఁగుం జొచ్చెఁ గీశ♦ముఖ్యబల మొగిన్.

క. అంత మహాతేజుఁడు నృప,కాంతుఁడు విక్రమము మెఱయఁ♦గాఁ జాపంబున్
సంతసమునఁ గొని తద్బల, మెంతయు ధైర్యమునఁ జొచ్చి ♦ యేచినకినుకన్.

క. శరవృష్టిం గురియించెను,, ద్వరఁగా రాముండు దనుజ♦బలముం గనుచుం
జొరఁబడి భయంకరుండై, శరవహ్నిం గాల్చుచుండు♦నమయమునందున్.

తే. అంబరంబున గ్రీష్మర్తు♦వందు మేఘ
ములు రవిం బోలె నారాము♦మూర్తి నసురు
లంతికంబున కేఁగంగ ♦ ననుద్రుపడక
యుండి, రంతట రాఘవుం ♦ డుద్యమమున. ౧౯ 4160

క. ఒరుల కశక్యములు భయం,కరతరములు నైనయట్టి ♦ కార్యంబుల నం
గరమున రాముఁడు చేయఁ గ,నిరి పిదపన్ ముందుఁ జూడ♦నేర రసురులున్.

చ. దనుజులు రాముకార్యములఁ ♦ దారు కనుంగొనకుండె కాక పెం
పనమున వాయుకృత్యముల ♦ భంగి నెఱింగియు వాయురూపముం
గనని తెఱంగునన్ నృపకు♦మారుఁడు సంగరహస్తలాఘవం
బునఁ జెను సేనఁ దోలుటయు ♦ భూరిరథంబులఁ జెండ చుంటయున్
గనఁబడుచుండెఁ గాని యటఁ ♦ గర్త కనంబడఁడయ్యె వారికిన్ ౨౧ 4162

సీ. ఛిన్నమై భిన్నమై ♦ శితశిలీముఖహవ్యవాహనదగ్ధమై ♦ భగ్నతరము
నయి శస్త్రపీడితం ♦ బయియున్న సేనను గాంచిరేకాని శీ♦ఘ్రమునఁ గృత్య
ములఁ జేయుచున్న రా♦ముని గనలేకుండి రత్తఱిఁ, బంచభూ♦తాత్మకంబగు
నంగంబునందలి ♦ యాపరమాత్మను బ్రజ లింద్రియవిషయ ♦ వారమందుఁ
*తే. బ్రేరకత్వముచే నుండ♦రీతి నెఱిఁగి
యతనిఁ బ్రత్యక్షముగఁ గన♦నట్లు రాముఁ
డంగములఁ బ్రహరింపఁగ ♦ నాతఁడు స్థితి
నెఱిఁగిరే కాని కన్నుల ♦ నెఱుఁగరైరి ౨౩ 4163

క. శరవేగంబున శ్రీరఘు,వరుఁ డబ్బేములఁ జరించి ♦ వధియింపఁగ న
త్తరుణమున రాక్షసులుత్,ధరణిని నతఁడుండు ననుచుఁ ♦ దలఁచుచు నచటన్.

చ కనఁబడు రాక్షసుల్ నృపతి♦కాంతుని గాఁగ భ్రమించి వీఁడె హ
స్తినికరమున్ వధించెడిని ♦ జెంపు వీఁడిదె రాఘవుండు స్యం
దనవరరాజిఁ జూర్ణముగఁ ♦ దానొనరించెడి వీఁడ గోలన
త్యునిశితబాణసంఘములు ♦ సోఁకఁగఁ జేసి పదాతివర్గమున్. ౨౪ 4165

తే. చంపుచున్నాఁడు హయములఁ ♦ జంపుచున్న
వాఁడటం చార్భటించుచు ♦ భ్రమసి యచటఁ
గలుగుసాదృశ్యమున నె యొ♦క్కని నొకరు
రాముఁడను కోపమునఁ బరా♦క్రమము మెఱయ ౨౫ 4166

క దనుజులు పరస్పరము త,మ్ములు దారే చంపుకొనిరి ♦ మూర్ఖులు దనుజుల్
ఘనతరమైన ప్రభావం,బునఁ [illegible] ♦ బొలిపె మానసమై ౨౬

క. తనరెడునయ్యస్త్రవరం,బున మోహి[illegible] సైన్య♦ము [illegible] రా
మునిఁ జూడఁ జాలరై, [illegible] ♦ [illegible].

తే. కనిరి రామసహస్రము♦లను [illegible], [illegible]మందె యా♦[illegible]నందె
యొక్కని నె రామునింగని,♦[illegible]మూర్తియైన రఘువుఁడా సేన♦యందుమిగిలి

* ఇంద్రియార్థేషు తిష్ఠంతం భూతాత్మాన మివ ప్రజాః-అనిమా.

చ. ఘనుఁడయి సాధుచిత్తుఁడయి ♦ క్రాలు రఘూద్వహుఁ డాశరాలి న
ట్లనిఁ బడఁ గూల్చి యొప్పుటకు ♦ నయ్యసురేజ్యులు సంప్రహృష్టులై
వినుతి యొనర్చి రిప్పనిని ♦ విక్రమసంపద నిట్లు చేయ నిం
క నెటులు సాధ్యమౌ నరయఁ ♦ గా ధర నొండులకంచు వేడుకన్. ౩౮ 4178

తొంబదినాల్గవ సర్గము సంపూర్ణము

---

౯౫ - వ సర్గము.

రాక్షసాంగనలు విలపించుట

సీ. తురగసంఘములు రౌ♦తులు వేనవేలుగ హస్తిగణంబులు ♦ నట్లు కేత
నాలంకృతంబులై ♦ యగ్నివలెం గ్రాలురథములు శూరులై ♦ పరిఘగదలఁ
బూని యుద్ధముచేయఁ♦గా నేర్చి కాంచనధ్వజచిత్రములచేతఁ ♦ దగి మఱియును
గామరూపులునయి ♦ భీమబలంబుల నొప్పురాక్షసు ♦ లోకము హతార్త
తే. మునను రాముఁడు వైచిన ♦ కనకభూషి
తాతిదారుణబాణాళి ♦ నంత మొంది,
రిట్లు రావణుఁ డంపిన ♦ యెల్లభటులు
చావ హతశేషులైన రా♦క్షసులు భీతి. ౧ 4179

క. చని లంకఁ జొచ్చి యందలి, దనుజులతోఁ జెప్పువారు ♦ తన్మూలబలం
బనిఁ దెగుట వినుచుఁ గనుచున్, దనుజాంగనలెల్లఁ గూడఁ♦దారుఁ బొగులుచున్.

క. వనటన్ మున్గిరి, దనుజాంగనలంతటఁ బతులు చావఁ ♦ గాఁ దనుజాతుల్
చనివిలయమొంద బాంధవు, లనిఁ దెగ నొకచోటఁ గూడి ♦ యార్తిఁ బొగులుచున్.

క. విలపించి రిట్లు, రావణు, చెలియలు శూర్పణఖ వృద్ధ ♦ చెలువు దొలఁగిన
ట్టులు దగునాకృతి గలదియు, నిలఁ దాఁకం గడుపు ప్రేల ♦ నింపుగనినదా. ౪

తే. ఇట్టి దక్కానసంబున ♦ నెలమి మదను
నట్లు చక్కనివాఁడయి ♦ యధికబలుఁడు
నగుచు సుకుమారుఁడయి హిత ♦ మఖిలభూత
ములకు నొసఁగెడు రాముని ♦ ట్టులుగఁ గనియె. ౫ 4183

చ. అనయము లోకనింద్యయయి ♦ యట్లు కురూపిణియైన రాక్షసాం
గన యిది రాముఁ గోరెనఁట ♦ కష్టగుణం బొకటైన లేని దీ
దనుజ మనోజ్ఞసద్గుణవి♦తానుఁడు రాముఁడు వీర్యశాలి మో
మున రుచివెల్గువాఁ డిది యు♦ముగ్ధతరాస్యయె యౌను జూడఁగన్. ౬ 4184

క. దనుజాంగన యిది రాముఁడు, మనుజుం డగునట్టివాని ♦ మదిఁ గోరె నెటో
కనుఁగొనఁగా ముదుసలితన, మునఁ దెల్లనివెండ్రుకలును ♦ ముడుతలును దగన్.

చ. కనుఁగొనరాని రూపమును ♦ గల్గినశూర్పణఖాఖ్య యిద్ది యా
దనుజులభాగ్యహీనతను ♦ దానవతల్లజులౌ ఖరాదు ల

య్యనిమొనఁ జావు నొందుటకు ♦ హాస్యముచేయఁగఁ జాలి లోకనిం
దనుగని చేయరానిదయి ♦ నాశకరంబును నైనకృత్యముల్. ౯౪ 4186

క. ఒనరిచె రామునిఁ గోరుచు;, ననుజాతనిమిత్త మిట్టు ♦ లసురేశుఁడు రా
మునితోడ వైరముం గొని, యెను గొప్పగ, రావణుండు ♦ హీనమతియునై.

చ. దనుజవధార్థమై నృపతి♦తల్లజుభార్యను బల్మిమీఱఁ దె
చ్చెను బలవంతుఁడౌ నృపతి♦సింహునితోడను దీర్పరానిదై
కన నతిదారుణంబగు ప♦గం దనయంతన సంగ్రహించినాఁ
డనుపమలక్షణాఢ్యయగు ♦ నాజనకాత్మజ యెన్నిభంగులన్. ౧౨ 4188

క. వీనిం గోరదు మనమున, నైనను, బూర్వమున సీత ♦ నాత్మహరింపం
గా నెంచి వేఁడునాతని, దానవుని విరాధు నొకఁడె ♦ ధాత్రీశుఁ డనిన్. ౧౨౪

క తునుముట చూచిన మన కా,తనివధమే పూర్ణమగు ని♦దర్శనము గదా,
వినుఁడు జనస్థానంబున, దనుజులు పదునాల్గువేలు ♦ దారుణకృత్యుల్ ౧౩౪

చ అలరుచునుండ వారిఁ గని ♦ యగ్నిశిఖాసదృశాంబకంబులన్
గలనునఁ జంపె, రాముఁ డటఁ ♦ గంజసఖోపమబాణపంక్తి ని
మ్ముల ఖరదూషణాసురుల ♦ మూర్ఖుని నాత్రిశిరున్ వధించెఁగా
గెలుచును రాముఁడే యనఁగఁ ♦ గృత్య మదే తలఁపంగఁ జాలదే. ౧౫

సీ. మఱియు రక్తమెగ్రోలు♦చునుజాశనుండగు నాకబంధుఁడు యోజ♦నాయతభుజుఁ
డయిక్రోధమునను భ♦యంకరంబుగ నార్చుచుండంగఁ జంపె, ని♦ట్లొక్కఁడట్టి
కార్యముచేయుటఁ ♦ గన రాముఁడే గెల్చుననుట కీదృష్టాంత ♦ మరయఁ జాలు,
గురుబలుండయి మేరు♦గిరిసమానుఁడు నగునింద్రనందను వాలి ♦ నేచి చంపె

తే. నిదియు రాముఁడె గెల్చు న♦హీనశక్తి
ననుటకుం జాలుదృష్టాంత, ♦ మరయదీనుఁ
డగుచు భగ్నమనోరథుం ♦ డగుచు ఋష్య
మూకముననున్న యక్కపి♦ముఖ్యు రవిజు ౧౬౪ 4192

చ. ఘనమతియైన రాఘవుఁ డ♦ఖండకపీశ్వరరాజ్య మేలఁగా
నొనరిచె నీయుదాహరణ ♦ మొక్కటి చాలును రాముఁడే జయిం
చునని వచింపఁగా, మఱియు ♦ శుభ్రయశుండు విభీషణుం డొగిన్
దనుజహితంబు సర్గమున ♦ ధర్మమునుం గలిగింపఁ జెప్పినన్. ౧౭౪ 4193

తే. యుక్తమైనది మోహంబు ♦ నొందిరావ
ణాసురుఁడు దానిఁ గొనఁడయ్యె ♦ యక్షరాజు
ననుజుఁ డవ్విభీషణుమాట ♦ యాలకించి
చేసియుండిన నీలంక ♦ చిత్రతరము ౧౯౪ 4194

తే. ఆ రనాదంబులను నిండి ♦ యాశ్రితాన

మట్టులుండక యుండఁగా, ♦ నానుపోస్ర
చేత గురుబలుఁ డనఁగ వి♦ఖ్యాతుఁడైన
కుంభకర్ణుఁడు హతుఁడయి ♦ కూలుట గను ౨౦౪ 4195

క. అని దుర్ధర్షుని సతి గా,యుని రావణుప్రియసతి నాఁజు ♦ సద్ధతి మీఁఱం
గను లక్ష్మణుండు దునుము ట,యని విని యును రామనుహి ♦ మురుతర మనుచున్.

క. దనుజేంద్రుఁ డెఱుఁగకున్నాఁ, డని, రంతట నాకుమారుఁ ♦ డనిఁ దెగియెనటం
చును నాభ్రాతయు మృతిఁ గనె,ననుచున్ నాపతియుఁ జచ్చె♦ ననుచు నిటువలెన్.

క. పురమునఁ గలరాక్షసమం,దిరముల నార్తలయి యేడ్పు ♦ నెలఁతలరవమున్
కరము వినంబడుచుండెను,, దరుణులు దుఃఖమున మఱియుఁ ♦ దత్తరపడుచున్.

సీ. శూరుఁడౌ రాముండు ♦ ఘోరిరథంబులఁ గరిహయంబుల భటో♦త్కరములతో
లుగ వధించినవాఁడు ♦ తెగి రుద్రుఁడో విష్ణువో సురాధీశుఁడై ♦యొప్పునింద్రుఁ
డో యముండో కాని ♦ యుద్ధంబునకు నిట్లు రాముని రూపంబున ♦ రమణ వచ్చి
మనవారి నెల్లర ♦ మ్రందించుచున్నాఁడు గాన మనుష్యుండు♦గాఁడు రాముఁ,

ఆ. డధికవీరులైన ♦ యట్టి మావారెల్ల
హతులై యగుటవలన ♦ నాశ జీవి
తమున వదలి యీభ♦యమునకుఁ దుదిఁ గాన
కయె యనాథలమయి ♦ కడవగలను ౨౦౮ 4199

క. విలపించుచు నున్నారము,పలుభంగుల, శూరుఁడైన ♦ పలలాశవరుం
డల బ్రహ్మయిడిన వరముల,కలిమిని గర్వించి భూమి♦కాంతు నివలనన్. ౨౦౯

ఆ. ఇపుడు కలిగియున్న ♦ యీఘోరభయమును
దెలియకున్నవాఁడు, ♦ దివిజరాక్ష
సులు పిశాచసంఘ♦ములును గంధర్వులు
నితని బారిఁ బడిన♦యతని ననిని ౨౧౦ 4201

క. పరిరక్షింపంజాలరు, దురమునఁ బ్రతితరుణమందుఁ ♦ దోఁచెడు దనుజే
శ్వరునకు నుత్పాతంబులు, పరికింపఁగ నింకమీఁద ♦ భయదము లగుచున్

ఆ. దుష్టశకునము లొగిఁ ♦ దోఁచి రావణునకు
రాముచేత మృతిని ♦ రయము మెఱయఁ
గలుగు ననుచుఁ జెప్పఁ♦గలవు, బ్రహ్మయు రావ
ణుని తపస్సు మెచ్చి♦కొని యతనికి ౨౧౨ 4203

క. దనుజసురరాక్షసులవల,నను భయమే లేదనుచు ఘ♦నంబగు కృపచే
తను వర మిచ్చెను నత్తఱి, మనుజులచేఁ జావకుండ ♦ మన రావణుఁడున్. ౨౧౩

క. వరమడుగఁ డయ్యెఁ; గావునఁ, దరుణంబున నిపుడు దనుజ♦తల్లజునకుఁ గ
ర్భుకులకు మర్త్యునివలననె, పరఁగెన్ బ్రాణాంతకర సు♦భద్రము భయమున్.

దనుజకాంత లపుడు ♦ తగఁ బరస్పరబాహు
వులను జాఁచి యొండొ♦రులను నార్తి. ౮౦ 4215

క. పరిరంభములను జేయుచుఁ, ద్వరపడుచు భయాతిశయము♦వలన నలఁగుచున్
బరిదీనలగుచు బిగ్గఱఁ, గర మాక్రోశించి రట్టె ♦ కళవళపడుచున్. ౮౧

తొంబదియైదవ సర్గము సంపూర్ణము.

---

౯౬ - వ సర్గము.

-:- మహోదరాదిమంత్రులతో రావణుఁడు యుద్ధమునకు బయలువెడలుట. -:-

క. పురమునఁ బ్రతిగేహంబులఁ, దరుణులు కరుణముగ నేడ్వఁ ♦ దన్నిస్వనమున్
సురవైరి రాజు వినియెను;, బర మార్తిని బొంది రనుచుఁ ♦ బరికించె మదిన్.

తే. అంత దీర్ఘనిశ్వాసము ♦ లఁగర క్షణము
ధ్యానమున నుండి పిదప న♦త్యంతకోప
మున భయంకరమూర్తియై ♦ కనఁబడియె న
తండు, దశనాళి నోష్ఠంబుఁ ♦ దాఁ గఱచుచు. ౨ 4218

తే. క్రోధసంరక్తనయనుఁడై ♦ క్రూరవిలయ
కాలదహనునిఁ బోలుచుఁ ♦ గడు వెలింగి
దనుజులకుఁ గూడఁ జూడంగఁ ♦ దరముగాక
భయముచే వ్యక్తములు గాని ♦ పలుకు లొప్ప. 3 4219

క. తనచెంత నున్నమంత్రుల, ఘనుల మహోదరుని నగ్ని♦కల్పుండగుచున్
దనరు విరూపాక్షుని న, ట్లనుపమబలుఁడైన యమ్మ♦హాపార్శ్వనినిన్. ౪

క. కనుఁగొని చూపులఁ గాల్చెడు, ననువున నవ్వారితోడ ♦ ననియెన్ సైన్యా
ళిని వేగమ యుద్ధమునకుఁ, జనవలయు మదాజ్ఞ ననుచు ♦ సరగునఁ జెప్పుఁడీ!.

చ అనవిన వారు భీతులయి ♦ యాతనియానతి నప్రమత్తులై
దనుజులఁ బ్రోత్సహించిరి, ని♦తాంతభయంకరరూపులైన యా
దనుజులు మంచిదంచుఁ బ్రవి♦దారణమందు శుభంబుగల్గ న
త్యనుపమరీతి నాశిషము♦లంది రణార్థము పోయి రందఱున్ ౬ 4222

తరళము దనుజులంతట న్యాయరీతిని ♦ దానవేంద్రుని గాంచి వం
దనముఖంబు లొనర్చి జేసికీ ♦ దద్దయున్ విజయంబు గ
ల్గను మనంబులఁ గోరుచున్ గర♦కంజముల్ ముకుళించి చెం
తను వసించిరి, రావణుండు ను♦దారకోపవశంబునన్. ౭ 4223

క. అరిబలము లక్ష్యపెట్టక, యరుదుగ నవ్వుచును నమ్మ♦హాపార్శ్వ మహో
దరుని విరూపాక్షుని గని, పరమాద్భుతభంగి మీఱఁ ♦ బలికెన్ మిగులన్.

తే. ఇపుడు నాచాపమునుండి ♦ యేగి విలయ
కాలభాస్కరసముములౌ ♦ కాండము లొగి
రామలక్ష్మణులను బిత్రు ♦ రాజుపురికిఁ
బంపు నిజమిద్ది, రణమునఁ ♦ బగఱఁ జంపి. ౧౦ 4225

క. అరినిహతులై దివంబున, కరిగిన కుంభశ్రవః ప్ర ♦ హస్తులకుఁ ని
ర్జరనాథవైరిఖరులకుఁ, బరమముదం బేను గూర్తు ♦ వైరులకడఁకన్. ౧౧

సీ. మద్బాణనీరద ♦ మండలంబులు గ్రమ్మ నాకాశమును దెస ♦ లఖిలనదులు
సంద్రముల్ వెలుఁగంగఁ ♦ జాలకయుండెడు, నిపుడుచాపమునుండి ♦ యేవుమీఱఁ
బత్త్రయుక్తములగు ♦ పటుసాయకంబులఁ బరఁగించి కపిముఖ్య ♦ బలము నెల్ల
భాగభాగములుగ ♦ భంజించి వచ్చెద, స్యందనంబను వాయు ♦ జవముచేతఁ

తే. జాపవార్ధిసముద్భూత ♦ సాయకోర్మి, తతుల వానరసైన్యంబుఁ ♦ దగ మథించి
పంపెదను జముపీటికిఁ, ♦ దెంపుమీఱ, నాదుబాహుబలంబునఁ ♦ బ్రోదిచేసి.

క. అరవిరిదమ్ములు గలచెఱు, వరసి మదద్విపము కలఁచు ♦ నట్టుగ నేనా
యరవిరిదమ్ములవలెనే, సురుదగు నానవము లొప్పు ♦ నగపడువారిన్. ౧౪

తే పద్మకేసరవర్చస్సు ♦ పరఁగ నొప్పు
వానరులసేనలను గూడఁ ♦ బట్టి కలఁచు
వాఁడ, నని నిష్ఠు వానర ♦ బలపతు లొగి
నాననంబుల బాణంబు ♦ లలముకొనఁగ. ౧౫ 4229

క ధరఁబడి సనాళకమలో, త్కరములు వ్యాపించునట్లు ♦ ధరణిం గాంతిం
బరికింపం దులతూఁగెడు, కరణిం జేయంగఁగలరు ♦ కలహానిపుణులై. ౧౬

క తరువులఁ గొని పోరెడు వన, చరులను నేనిప్పు డొక్క ♦ సాయకవరముం
బరఁగించి శతము శతముగఁ, బొరిగొందును, యుద్ధరంగ ♦ మున నిత్తఱిన్.

క. తనయులు భ్రాతలు భర్తలు, వనితల కెవ్వ స్తులకును ♦ వైరినిహతులై
చనిరో యాస్త్రీలకు నేఁ, గను జలములఁ దుడుచువాఁడఁ ♦ గడుఁబూన్కి మెయిన్.

చ అనిమొన నాశరాహతుల ♦ నక్కపులన్ వధియించి ప్రాణముల్
చన నెటు లెట్టులో పడిన ♦ సాధ్వసదాయకవర్ష్మయుక్తి ధా
త్రినిఁ గడుఁ గప్పి కష్టతర ♦ రీతిని దానిఁ గనంగఁ జేసెదన్,
గనుఁ డిఁక మాంసముం దినెడు ♦ కాంక్షఁ జెలంగెడు నక్కగుంపులున్. ౧౯

ఆ గ్రద్దలితరజంతు ♦ గణములు తృప్తిగాఁ, దినఁగ నాశరాహతు ♦ లను మదీయ
వైరి మాంసములను ♦ నడ్డించి సంతోష, మంనఁజేయువాఁడ ♦ నాదరమున.

క. అరకం బలంకరింపుఁడు, త్వరగా నా ధనువుఁ దెండు ♦ వైళమ దనుజో
త్కరములు మిగిలిన యవి, నా, యరకముతో వచ్చుఁగాక ♦ యనిపలుకుటయున్.

క. దనుజేంద్రునివాక్యంబును, వినిన మహాపార్శ్వుఁ డచట ♦ వెలయు భటాధీ

శనికరముఁ గాంచి వేగమ, దనుజానీకముల వెడలఁ ♦ దగు నిఁక ననుచున్.

క. తెలుపుఁడని యాజ్ఞ నిడె, నా, పలుకులు విని ప్రబలులైన ♦ భటనాథులు సే
నలఁ బిల్వఁగఁ బ్రతిగేహం, బులకుం జని పిల్వఁ ద్వరిత♦ముగ భటులెల్లన్.

తే బయలు వెడలమికిం గ్రోధ♦వశగతులయి
వాడవాడలకుం బోయి ♦ పరుసఁ దిరిగి,
రంతట మహూర్తమునకు భ♦యంకరాస్య
లయి భయంకరదర్శను♦లయి యాఱుచు ౨౩౪ 4238

సీ. అసిపట్టసములు శూ♦లాయుధంబులు గదల్
ముసలాహ్వయాయుధ♦ములును *ద్విఫల
పత్త్రాగ్రములు గల్గు ♦ పటుత నాయుధములు
తీక్ష్ణధారలుగల ♦ తీవ్రశక్తు
లురుతరకూటము♦ద్గరములు యష్టులు
వరచక్రములు మఱి ♦ వాఁడియైన
వరపరశ్వధభిండి♦వాలశతఘ్నులు
మఱియితరములగు ♦ మహితసాధ

ఆ నములు చేతులందు ♦ నమరంగ వెడలిరి,, వాహినీశుఁడధిపు♦పలుకుఁ గొనుచు
నరద మష్టఘోట♦కాన్వితమయి సూత, సహితమగుచు నొప్ప ♦ సరగఁ దెచ్చె.

క. తన తేజంబున వెలుఁగుచు, ఘనమగునరదంబు భీతి♦కరుఁ డాతఁడు చ
య్యన నెక్కె, నంత రావణుఁ, డనుపమరక్షోబలవ్ర♦జాన్వితుఁ డగుచున్. ౨౬

క అతిశయబలమున నొప్పుచు, క్షితిభేదించెడు విధంబు ♦ చెచ్చెఱఁ దోఁపన్
మతిమహిమఁ బయనమయ్యెను, నతివేగను, యప్పు డమ్మ♦హాపార్శ్వుండున్.

ఆ. అమ్మహోదరుండు ♦ ననిని దుర్ధర్షుఁడై, తగువిరూపనయనుఁ♦డు గడుఁ బ్రీతి
నధిపునాజ్ఞ నొంది ♦ యరదంబు లెక్కిరి,, వారుసంతసమున ♦ వఱలుచుంట

క. ధరభేదించెడు తెఱఁగునఁ, గరము భయంకరముగాఁగఁ ♦ గరినరవము లం
బరమున నిండఁగ విజయా, తురులయి చని రనికి, నుద్ధ♦తుఁడు రావణుఁడున్.

చ. గురుతర తేజ మొప్పఁగను ♦ క్రూరమహాసురసంఘయుక్తుఁడై
నిరుపమచాపముం గొనుచు ♦ నిర్భరశౌర్యము పొంగ నంతకుం
డరయ లయంబునం బ్రజల ♦ నంసఱఁ జంపెడుపోల్కిఁ జూడనై
యరిగె, మహారథుండయిన ♦ యాదనుజేశ్వరుఁ డుగ్రరూపుఁడై. ౨౪౦ 4244

తే. ప్రజవనాశ్వసమాయుక్త♦రథము నెక్కి, యేస్థలంబున రాఘవు♦లెసఁగుచుండి
రట్టి యుత్తరదిక్కున ♦ ననికి వెడలె,, నర్కుఁ డప్డువికాంతుఁడై ♦యాలరకుండె.

క. తమనులు దిక్కులఁ గ్రమ్మెను, ఘమ ఘూర్ణిల ఘోంపక్షి♦గణ మఱచెను వే

---

* గదాభిర్ముసలైర్హస్తైః-అనిమా హలైః ద్విఫలపత్త్రాగ్రాయుధవిశేషైః-అనివ్యాఖ్య

క్షమ చలియించినరీతిగ, నమరె మహారక్తవృష్టి ♦ నభ్రము గురిసెన్. ౩౩ 4246

క. తురగములు త్రోవలోపలఁ, జరియించుచుఁ గూలఁబడె ధ్వ♦జంబులతుది వ్రా
లె రయంబున గ్రద్దలు భీ,కరముగ నశుభముగ వంచ♦కవ్రజ మఱచెన్ ౩౪

సీ. దనుజేంద్రువాహన♦మున మదరెను వివర్ణంబయ్యె మోము స్వ♦రంబు తగ్గె,
నందుండి రావణుఁ ♦ డనిఁ జేయ వెడలంగ నంతంబు సూచించు♦నట్టి చిహ్న
ము లివి తోఁచెను నభం♦బుననుండి నిర్ఘాతసమనిస్వనంబయి ♦ చాల వెల్గు
నుల్క క్రిందను బడె,♦నుగ్రంబుగానశుభమును దెల్పుచునుగృ♦ధ్రములుకూసె

తే. వానితోఁ గూడి యఱచెను ♦ వాయసములు,
కాలచోదితుఁ డగుట నీ♦లీలఁ దనకుఁ
గనఁబడిన దుర్నిమిత్తము♦లను దలంప
కతఁడు మోహంబునన్ మృతి♦నంద వెడలె. ౩౫ 4248

క బలశాలు రైన యోధను,జులరథఘోషమును వినుచు ♦ సొరిదిఁ బ్లవగసే
నలు యుద్ధము చేయంగా, నిలిచెను, దనుజకపీశ♦నికరము లంతన్. ౩౬

క. ఇతరేతరజయకాంక్షుల, నతికోపంబునఁ బరస్ప♦రాహ్వయముల ను
ద్ధతిఁ బిల్చుచుఁ దుములంబుగ, జతనము మీఱంగ రణము ♦ సల్పెఁ గడిమిమై.

చ. దనుజవరేణ్యుఁ డంతటఁ గ్రు♦ధం గొని వానరసేనఁ జొచ్చి కాం
చనమయబాణజాలములఁ ♦ జయ్యన వైచుచు భూరిసంగరం
బొనరిచె, రావణుండు బల♦మొప్పఁగ నప్పుడు కొంతమందిశీ
ర్షనికర మట్టె త్రుంచెఁ బటు♦శాతశరంబులు వైచుచుం గడున్. ౪౨ 4251

తే కొంతమందిని మూర్కొన ♦ గుండె లట్టె
నదరఁ గొట్టెను గొందఱ ♦ గదిసి చెవులఁ
దెగఁగఁ గొట్టెను, రావణు♦తీక్ష్ణసాయ
కములఁ గొందఱు వనచరుల్ ♦ కదలలేక ౪౩ 4252

సీ. ఊర్పులనైనఁ దా♦రొగిఁ బుచ్చఁజాలక హతులైరి కొంద ఱ♦య్యాహవమునఁ
బ్రక్కలు పోవంగఁ ♦ బడిరి, కొందఱఱోలల్ భిన్నంబులయ్యె నా♦విశిఖతతులఁ
గన్నులు పోయె న♦క్కపులలోఁ గొందఱ,కంతరావణుఁ డాజి ♦ నరదమెక్కి
యుండి యేదిక్కున ♦ కురుకోపమునఁ గనుల్ త్రిప్పుచు నేగునో ♦ తీవ్రసాయ

తే. కముల వైచుచు నందందుఁ ♦ గలుగు కపులు
తచ్ఛరావళి వేగంబుఁ ♦ దారుసైఁపఁ
జాలకయె పౌరుషము వీడి ♦ సత్వరముగఁ
బాఱిపోయిరి రాక్షసుల్ ♦ పక్కన నగ ౪౪ 4253

తొంబదియాఱవసర్గము సంపూర్ణము

౯౭ - వ సర్గము.

విరూపాక్షుఁడు సుగ్రీవునిచే నీల్గుట

క. దనుజేంద్రునిచే నత్తఱిఁ, దనువులు తెగి యందు నందు ♦ ధరఁబడియుండం
గను యుద్ధభూమి యెల్లను, వనచరశవములను నిండి ♦ భయదంబయ్యెన్. ౧

క. శలభంబులు దీప్తుండగు, జ్వలనుని సైఁపంగలేని ♦ చందంబునఁ గోఁ
తులు తాళఁగఁ జాలని య, ప్పలలాశనుతీవ్రశరజ ♦ వము నోర్వకయే. ౨ 4255

క. పరుగెత్తిరి, మఱియును వన, చరు లానిశితాంబకములఁ ♦ జయ్యనఁ దనువుల్
పరివీడితంబు లౌటను, బరుషములగు వీతిహోత్ర ♦ జ్వాలలగుములుక్. ౩

క. తనువులఁ గాల్పఁగఁ బఱచెడు, వనగజములరీతి సైఁప ♦ వలనుపడమి ని
స్వనములతోడం బాఱిరి;, ఘనమేఘంబులను దోలు ♦ గాలివడువునన్ ౪

తరల. దనుజనాథుఁడు కీశసేనల ♦ దారుణాంబకసంతతిన్
బెనురణంబునఁ జిమ్మివైచుచు ♦ వేగమే చనుచుండె, నా
దనుజవీరుఁడు వానరాళిని ♦ దానిసిన్ బొలియించుచున్
జని త్వరన్ రఘురామచంద్రుని ♦ సన్నిధానముఁ జేరఁగన్. ౫ 4258

తరల. అనిమొనం బ్లవగేంద్రులీవిధి ♦ నద్భుతంబుగ భంగముం
గనుచుఁ బాఱుచునుంట నంతటఁ ♦ గాంచి గుల్మమునన్ సుషే
ణుని దగన్ నియమించి సూర్యత ♦ నూజుఁ డెల్లరు నద్భుతం
బును గనన్ రణముం బొనర్పఁగఁ ♦ బూనె నెమ్మదిఁ గోరికన్. ౬ 4259

. తనసాటి విక్రమాదులఁ, గనినసుషేణునిని బలముఁ ♦ గావఁగ గుల్మం
బున నునిచి పాదపముఁ గొని, చనియెన్ సుగ్రీవుఁ డరి యె ♦ సంగెడుక్షితికిన్. ౭

. హరినాయకునిన్ యూథే, శ్వరు లంతటఁ దారె యుద్ధ ♦ సాధనముల నా
తరుణమున నీయఁ బెనుభూ, ధరముల వివిధద్రుమములఁ ♦ దగఁ గొనిత్వరఁ గాన్. ౮

. పార్శ్వపృష్ఠములను ♦ బలములతో వెంబ
డించి చనిరి, కడుఁ గ ♦ డింది మెఱయ
నాహరీంద్రుఁ డద్భు ♦ తాంగబలమ్మున
నార్చుచున్ మహాసు ♦ రాళి నపుడు ౯ 4262

. అనిమొనఁ గూల్చుచు నుత్తమ, దనుజులపయి కడరె, నంత ♦ దారుణరూపం
బునఁ దగు నాసుగ్రీవుం, డనిలుఁడు విలయమునఁ బెద్ద ♦ వగు వృక్షములన్. ౯

. ధరఁబడఁ గూల్చెడురీతిని, నరివైరులఁ బిండిచేసె, ♦ నటవిఁ బతంగో
త్కరములపై మేఘము ప్ర, స్తరవృష్టిని గురియునట్లు ♦ దనుజావళిపై ౧౦

క. గిరివృష్టిని గురిపించెను, హరినాయకుఁ, డంతఁ గపివ ♦ రాధీశ్వరుఁ డ
క్కరణిఁ గురిపించువృష్టిని, ధరణీధ్రము లశనిహతిని ♦ దగఁ బగులు క్రియన్.

* శైలవర్షం వవర్ష హ - అనియూ.

క. దనుజులశీర్షంబులు తుత్తునియలుగాఁ బగిలి ధరణిఁ ♦ దోడనె వ్రాలన్,
దనుజబలంబులు చయ్యన, వనచరపతిచేత నట్లు ♦ భగ్నము లగుచున్ ౧౨

ఆ. హింస నొంది యఱచి ♦ యేమియుఁ బ్రతిచేయఁ
జాల కెంతొ యార్తి ♦ సంక్షయంబుఁ
గాంచుచుండుటయును ♦ గాంచి విరూపాక్షుఁ
డని సహింపరాని ♦ యట్టి ధనువు ౧౩ 4267

క. అనువునఁ గైకొని నామం,బును బల్కుచు రథమునుండి ♦ పొలుపగు వేగం
బున దుమికి గజస్కంధం,బు నెక్కె, నారథికవరుఁడు ♦ పొంగెడుకాంక్షన్.

చ ద్విరదము నెక్కి నిస్వనము ♦ భీమముగాఁగ వినంబడంగ నా
హరులపయిం జనెం ద్వరగ, ♦ నంత నతండు చమూముఖంబునన్
బరఁగెడు వాలితమ్ముఁ గని ♦ నైజభయంకరభూరిమార్గణో
త్కరమును వైచి దిక్కులకు ♦ దర్లు సురారుల భీతిఁ బాపుచున్ ౧౫ 4269

తే. తృప్తిఁ గలిగించి నిలిపెఁ, గ♦పీంద్రుఁ డట్టు
లవ్విరూపాక్షుతీవ్రబా♦ణాళి నొచ్చి
యధికకోపంబు నొందుచు ♦ నతనిఁ జంప
మనమునఁ దలంచె; నంత న♦వ్వనచరపతి ౧౬ 4270

క. శూరుఁడు లక్ష్యము మీఱఁగ, వైరిం బ్రహరించునట్టి♦వాఁడౌట మహా
భూరుహమును బెకలించియె, యారాక్షసుపైకి నడరి ♦ యాగజముఖమున్.

క. పరికించి దాన మోఁదెను,, గరివర మది వ్రేటువడుచుఁ ♦ గార్ముకమాత్రం
బరుగుచు వెనుకకు నచ్చటఁ, గరమార్చుచుఁ గ్రిందఁబడియె♦గళవళపడుచున్

ఆ. అంతవీర్యవంతుఁ ♦ డావిరూపాక్షుండు, ధరణి వ్రాలినట్టి ♦ కరిని డిగ్గి
జవముమీఱ వృషభ♦చర్మము ఖడ్గంబుఁ, గై గ్రహించి వైరి♦కడకు నిగిడి.

క. స్థిరముగ నిలువంబడు నా,హరివరుపై కరిగి యట్టె ♦ యతిక్షితునిగాఁ
గరమొనరించెడులాగున, నరిగెన్ లఘువిక్రమమున ♦ నాశవిసుతుఁడున్.

చ. దనుజుఁడు పైకి వచ్చుటకుఁ ♦ దా మదిఁ గోపమునొంది భూరిమే
ఘనిభమహాశిలం గొనుచుఁ ♦ గ్రన్నన వేసెను వానిపైన, నా
దనుజవరుండు విక్రమము ♦ తప్పయుఁ గన్పడవచ్చుచున్న యా
ఘనశిలఁ గాంచి వేతొలఁగి ♦ ఖడ్గముచేఁ బ్రహరించె నాతనిన్ ౨౧ 4275

మ. బలవంతుండగు రాక్షసేంద్రుఁ డలుకం ♦ బాటించి ఖడ్గంబునం
దలపై వ్రేఁగి దాని దెబ్బకు ముహూ♦ర్తం బామహావీరుఁ డా
యిలపై వ్రాలినరీతి మూర్ఛఁ గని యు♦ట్లే లేచి వేగంబ దో
ర్బల మొప్పారఁగ నమ్మహాహవమునం ♦ బ్రారంభ మేపారఁగన్. ౨౨ 4276

ఆ. ముష్టి నలవరించి ♦ దుష్టరాక్షసువక్షం బందుఁ బొడిచె, దాన ♦ నతఁడు కోప
మొంది తీక్ష్ణధార ♦ నొప్పు నాయసిచేత, వనచరేంద్రుకవచ♦మును రణమున

క. తునియలుగాఁ బడవైచెను, ఘనమగునా వ్రేటునకు ని♦కామం బార్తిం
గని సుగ్రీవుఁడు చరణము,లను జాఁచుకొనుచును బడె ని♦లాస్థలిమీఁదన్.

చ. ధరఁబడి వేగ లేచి కపి♦తల్లజుఁ డాకులిశంబువంటిదౌ
కరతలసంప్రహారమున ♦ గాఢరవంబును గల్గఁ గొట్టఁగా
సురరిపుఁ డట్టు లాకపియు ♦ శూరతఁగొట్టిన దెబ్బ నెట్టులో
నిరుపమశక్తిఁ దప్పునటు ♦ నేర్పునఁ జేసికొనెన్ రయంబునన్ ౨౮ 4279

తే. ఇట్లు తప్పించుకొని యతఁ ♦ డేపుమీఱ
వనచరేంద్రునిఱొమ్మును ♦ గని పిడికిటఁ
బొడిచె, నవ్వానరేశుఁడు ♦ పిడికిటఁ బొడు
వగను దప్పించుకొని వాఁడు ♦ బదులు తన్ను ౨౯ 4280

సీ. ప్రహరింపఁగాఁ గని ♦ పరమకోపంబున నాతఁ డేమఱియుండు ♦ టరసి యట్టె
తనపెద్దయఱచేత ♦ దనుజుఫాలంబునఁ దగునస్థిపైఁ గొట్టె, ♦ దనుజుఁ డంత
వజ్రసన్నిభమగు ♦ వైరితలప్రహారమునకుఁ బ్రస్రవ♦ణముననుండి
జలము స్రవించెడు ♦ చందంబునన్ నల్ల గ్రక్కుచు రక్తసి♦క్తతనుఁ డగుచు

ఆ. ధరణిఁ గూలె, నిట్లు ♦ తనురంధ్రములనుండి
రుధిర మట్టె గాఱ ♦ రోషయుక్తిఁ
గనుల వేగ త్రిప్పు♦చును నోట నురుగులు
వెడల నల్లఁ దోఁగి ♦ పుడమినిఁ బడి. ౩౦ 4281

క. తనవిక్రృతపుఁగన్నులు మఱి,యును వికృతంబులుగ నొప్పు♦చుండన్ భీతిం
గనఁ జేయునట్టి దనుజుని, గని రుభయుబలమ్ములందుఁ ♦ గలవారెల్లన్. ౩౧

క. అరిదైన విరూపాక్షుం, డురువేగన నెగిరిపడుచు ♦ నుర్వీస్థలిపై
నిరుప్రక్కలఁ బొరలుచును రు,ధిరమున మున్గుచును విన మ♦దింగృపగలుగన్.

క. ధ్వనిచేయుచుండఁ గాంచిరి, వనచరు, లారీతిఁ బ్రకట♦బలములఁ దగునా
దనుజకపిసైన్యజలనిధు, లనుపమగతి నొకటినొకటి ♦ నని మార్కొనుచున్.

క. చెలియలకట్టల మీఱుచుఁ, జలమున మార్కొన్న భూరి♦జలరాసు లనన్
గలగుండుపడుచు నాప్పలు, చెలఁగన్ బవరంబు నట్టె ♦ చేసెఁ గడంకన్. ౩౪

క. హరిపతియు విరూపాక్షుని, నుగుఁబలునిం బొలియఁ జేయ ♦ నుబ్బుచుఁ గని యా
హరిసేనలు దుఃఖంబున, సురవైపులఁ బౌరుషములు ♦ సొరిదిఁ జెలంగన్.

ఆ. గట్టు పొరలి వచ్చి♦నట్టి గంగాప్రవా,హము విధంబుతోఁప ♦ నట్టె పొంగి
యొగిఁ బరస్పరంబు ♦ నుద్ధతి మీఱంగఁ, బోరి రాత్మవిజయ♦ములను గోరి.

తొంబదియేడవ సర్గము సంపూర్ణము.

## ౯౭ - వ సర్గము.

-ఆఆ సుగ్రీవుఁడు మహోదరుని బరిమార్చుట ఆఆ-

క. పెనుసంగరమున నయ్యెడ, వనచరదనుజులభటాళి ♦ వా-రక యొండొం
టిని జంపుచునుండఁగ జవ,మున వేసవి సరసులవిధ♦మున క్షీణించెన్. ౧

చ. తనబలముల్ క్షయింపఁ గని ♦ దానవనాథుఁడు రావణుండు నె
మ్మనమున నాభటాధిపతి♦మండనుఁడైన విరూపనేత్రుఁ డా
వనచరనేతచేఁ బడుట ♦ వారనికోపము రెండురెట్లుగాఁ
గనఁబడ నుగ్రుఁడయ్యెఁ, గపి♦కాంతులు పౌరుష ముల్లసిల్లఁగాన్. ౨ 4239

చ. బలములనెల్లఁ జంప నవి ♦ ప్రక్షయముం గనుచుంటఁ గాంచి యా
బలుదురమందు దైవము వి♦పర్యయమై తనపట్ల నుంట ని
మ్ములఁ దలపోసి చింతిలుచు ♦ మ్రోలఁ జెలంగుచు శత్రుహంతయై
ఖలుఁడగు నమ్మహోదరుని ♦ గర్వయుతుం గని పల్కె నివ్విధిన్. ౩ 4290

క. వీరా! గురుతరబాహూ!, ఘోరంబగు నిట్టితఱిని ♦ గోరిక విజయం
బారూఢిఁ గాంతు నన నా,ధారము నీవనియె నమ్మఁ♦దగు నట్లగుటన్ ౪ 4291

క. అరిసేనలఁ బొలియించుచుఁ, బరాక్రమముఁ జూపవయ్య ♦ భర్తఋణము ని
స్తరుణమునఁ దీర్చుకొనుటయె,సరియగు నొనరింపుమిపుడు♦సంగరముఁ గడున్.

చ. అన విని రాక్షసేంద్రుఁడగు♦నట్టి మహోదరుఁ డల్లియించు న
వ్వనచరసేనలో మిడుత ♦ వహ్నిని జొచ్చెడురీతిఁ జొచ్చె, నా
ఘనబలుఁ డుగ్రతేజమునఁ ♦ గ్రాలెడువాఁడయి పొల్చుచుంట నా
తనిపలు కౌదలం గొని ని♦తాంతము స్వీయపరాక్రమంబుచే
తన్ను బురికొల్పఁగాఁ బడుచు ♦ దారుణయుద్ధ మొనర్చె వారితోన్. ౬ 4293

చ. హరులు మహాబలాఢ్యులు భ♦యంకరరాక్షససేనఁ జొచ్చి ప్ర
స్తరముల గొప్పవానిఁ గొని ♦ దానవులన్ వధియించి, రంత సం
గరమున నమ్మహోదరుఁడు ♦ గాఢతరక్రుధఁ బూని యచ్చట క
ర్బురనువిభూషితాంబకస♦మూహములం బరఁగించి పూనికన్. ౭ 4294

క. వనచరులపాణిపాదము,లను దొడలను నఱికి యయ్యె♦లాస్థలి నించెన్;
దనుజాంబకార్దితాంగులు, వనచరు లొకకొంతమంది ♦ భయపడి పెలుచన్.

తే. దెసల కేగిరి, కొందఱు ♦ వెస నధిపతి
నాశ్రయించిరి, కపులసై♦న్యములు భంగ
మొంది పాఱుటఁ గాంచి య♦త్యుగ్రుఁడగుచు
నర్కసుతుఁడు మహోదరు ♦ నచట. జూచి ౧౧ 4296

క. గురుతేజము పొంగఁగ నా,పాదిని వధింపంగఁ బూని ♦ యవనీధర మ
ట్లురుతరమగుఘోరప్ర,స్తరమును గొని దానివై చెఁ ♦ దానవుపై నన్. ౧౨

* జయాశా త్వయి మే స్థితా - అనిమూ.

క. తనపైకి రయము మీఱఁగఁ, జనుదెంచెడు శిలను దానిఁ ♦ జక్కం గని యా
దనుజుఁ డసంభ్రాంతుండై, కనవైనఁ దరంబుగాని ♦ ఘనశిలఁ గడఁకన్. ౧౩

క. శరములఁ ద్రుంచెను, నట ప్ర,స్తరమది యాదనుజశరహ♦తంబయి పడియెన్
ద్వరఁ దునియలు వేయిగ నటఁ, గరమరుదుగ గ్రద్ధలెల్లఁ ♦ గళవళపడుచున్.

ఆ. చెదరి నేలపైనఁ ♦ జేర వ్రాలెడురీతి,
నట్లు వ్రక్కలైన ♦ యాశిలఁ గని
యర్కతనయుఁ డుగ్ర♦మగుకోపమును బొంది
యనిమొనన్ మహీరు♦హంబుఁ బూన్కి. ౧౫ 4300

చ. కరములఁ బెల్లగించి యల ♦ కర్బురుపైఁ బడనేసె, శూరుఁడై
పరపురనాశకుండగుచు ♦ భాసిలునట్టి మహోదరుం డొగిన్
శరములఁ దానిఁ ద్రుంచె నిటు♦పాలము భూమిఁ బడంగఁ గాంచి యా
హరిపతి క్రుద్ధుఁడై పరిఘ ♦ మయ్యవనిం బడియుండఁగాఁ గనెన్. ౧౬ 4301

క. కని దీప్తంబగు పరిఘం,బును దానిన్ సంగ్రహించె ♦ భూనికమీఱం
దనకరలాఘవమును నా,తనికిం జూపుచును వేగ ♦ దాని చివరచేన్. ౧౭ 4302

క. తురగవరంబులఁ గూల్చెన,, సురవైరి మహోదరుండు ♦ శూరుం డగుటన్
దురగవిహీనంబగునా, యరదము దిగ నుఱికి క్రుద్ధుఁ♦డై గదఁ గొనియెన్.

క. పరిఘగదాయుధకరు లా,యిరువురు మెఱపులను గూడి ♦ యొసఁగుఘనము ల
ట్లురుజవమునఁ ద్రిప్పుచు సం,గరమున గోవృషములట్లు♦గా గర్జిలుచున్. ౧౯

క. తలపడి, రంత మహోదరుఁ, డలుకన్ రవికాంతిఁ బోలి ♦ యలరుగదను ని
మ్ముల వైచె నర్కజునిపైఁ, బలశాలి హరీశ్వరుండు ♦ భయదంబగుచున్. ౨౦

క. తనపైఁ బడఁగన్ వచ్చెడు, దనుజుమహాగదను జూచి ♦ దారుణరుషచే
గను లెత్తఁబాఱఁ బరిఘం,బు నెత్తి యాగదను దానఁ ♦ బొంగుచుఁ గొట్టెన్.

క. ఆరెండు పరస్పరమును, దారుణముగఁ దాఁకి పగిలి ♦ ధరణిం బడియెన్,
భూరితరతేజుఁ డాకపి,వీరుం డెల్లెడలఁ గనక♦వేష్టిత మగుచున్ ౨౨ 4307

తే. ఘోరమును నైన ముసలంబు ♦ ధారణి నట
నాయసంబయి పడియుండ ♦ నపుడు గాంచి
దాని గ్రహియించె, నిట్టు లా♦తండు దాని
గొని మహోదరుపైన వై♦చెను గడంగి ౨౩ 4308

క. దనుజుఁడు వేరొకగద నా,వనచరపతిపైన వైచె ♦ వసుధం బడె రెం
డును బిట్టునాఁకి యనివును, దునియలుగా నగుచు, నంత ♦ దోర్బల మలరన్.

సీ. ఆయుధావళులెల్ల ♦ నవ్విధిఁ జెడిపోవ వారలిద్దఱు మండు ♦ వహ్నియుగము
వలెఁ దేజమున నొప్పి ♦ యలఘుముష్టులఁబట్టి మార్కొని రప్పు స♦మరమునందు

నపజయ మెఱుఁగక ♦ యరిజనపరితాపకరులగు వార లి♦ర్వురును దాఁకి
తన్నుచుఁ బిఱుమాఱు♦దారుణధ్వను లొప్పఁ జేయుచు మఱి యఱ♦చేతులూని
చఱచుచు నిద్దఱు ♦ త్త్వాస్థలిఁ బడి వేగ పైకిలేచుచుఁ దమ♦బలముల కొలఁ
తే. దినిగఁ బ్రహరించుచుఁ మఱి♦యును భుజముల
నెత్తి విసరుచు శ్రమమొంది, ♦ ర త్తఱి గురు
జనమునం బొల్చు రాక్షస♦సత్తముండు
చెంత నిల నున్నఖడ్గంబుఁ ♦ జే గ్రహించి ౨౮ 4310
క. పలుకయును జేతఁ గొనుచుఁ, దలఁపఁగా దనుజు మీఱఁ♦దగువేగంబుం
గల సుగ్రీవుం డచ్చటి, పలుకయు ఖడ్గంబుఁ గొనియె ♦ బరవస మలరన్. ౨౯
క. భండనశాస్త్రంబునఁ గడుఁ,బండితులొ వార లుబ్బు♦వర్ధిలఁ గా ను
ద్దండతరాసుల నెత్తుచుఁ, జంకతరక్రోధ మొప్ప ♦ స్వనములు నిగుడన్. ౩౦
క. ఇరువురు కలపడి, రపుడొం,డొరులపయిం గ్రోధమూని ♦ యొగి గెలువఁగనా
తురపడుచు శీఘ్రగతులం, బరఁగుచు సవ్యాపసవ్య♦భంగిఁ దిరుగుచున్.
క. తలఁపడి పోరిరి, శూరకుం, డలఘుజవుండైన రాక్ష♦వాలిఘనుఁడు వాఁ
డలఘుపరాక్రమఘనుఁడై, చెలఁగుచు దుర్మతియె గానఁ ♦ జిత్తవికృతిచేన్.
*తే అప్పు డరిచేతిచర్మము♦నందుఁ జిక్కు
కొనఁగ ఖడ్గము వైచె, నా♦దనుజుఁ డంత
దనదుఖడ్గంబు డాలునఁ ♦ దగిలియుండఁ
బట్టి లాగుకొనుచునుండ ♦ వనచరపతి. ౩౩ 4315
క కని యంతరమున ఖడ్గం,బునను శిరస్త్రాణయుక్త♦మును గుండలకాం
తినిచయరమ్యమునగు నా,తనిశిరమును ద్రుంచెఁ జాల♦ధైర్యస్ఫూర్తిన్.
చ తలదెగి నేలపై దనుజ♦శల్లజుఁ డత్తఱి వ్రాలఁ గాంచి యా
బలములు నిల్వకే పఱుగు♦వారె, మహోదరునిన్ వధించి దో
ర్బలమున నొప్పు కీశపతి ♦ భవ్యమతిన్ భటయుక్తుఁడౌచు ని
స్తులరవ మొప్పఁ జేసెఁ దమి♦తో దశకంధరుఁ డద్ది చూచుచున్ ౩౬ 4317
చ. మనమునఁ గ్రుద్ధుఁడయ్యె రఘు♦నందనుఁ డాత్మ ముదంబుఁ గాంచె నా
దనుజులు దీనచిత్తులయి ♦ తద్దయు మోములు తెల్లనై భయం
బున మనముల్ తపింపఁగను ♦ బోయిరి, భూరిధరైకభాగ మొ
య్యనఁ బడఁ జిమ్మినట్లుగ మ♦హాదనుజుం బడఁగూల్చి ప్రీతుఁడై ౩౭ 4318
చ వనచరసేనయుం దపుడు ♦ భానుఁడు స్వప్రభ నప్రధృష్యుఁడై
కనఁబడురీతి మిక్కిలియుఁ ♦ గాంతియుఁ గీర్తియు నొప్ప రాజిలెన్,
వనచరనాథుఁ డంత మఱి♦వైభవయుక్తు డు సంగరాంగణం
బున విజయంబు నొందె సుర♦పూగము సిద్ధులు యక్షులాదృతిన్. ౩౮ 4319

---

* లగ్న ముత్కర్షతః ఖడ్గమ్-అనిమా.

క. ధరఁగల భూతంబులు మో,దరతిఁ సంతోష మొలరఁ ♦ దనుఁ బొగడంగాఁ
గరము వెలింగెను శ్రీరఘు,వరుఁ డౌరా యనుచు మోక♦వార్ధి మునుంగన్.

తొంబదియెనిమిదవ సర్గము సంపూర్ణము.

## ౯౯ - వ సర్గము.

అంగదుఁడు మహాపార్శ్వుని జంపుట.

క. వనచరపతిచే సంగర,మునను మహోదరుఁడు మృత్యు♦ముఖగతుఁడగున
ట్లనువుగఁ జేయంబడఁగాఁ, గనుచు మహాపార్శ్వుఁ డుగ్ర♦కల్పుఁడు క్రుధచేన్.

క. తనఘనబల ముప్పొంగఁగఁ, గను లగ్ణంబుగను నొప్పఁ♦గా భయదంబై
కనఁబడు నంగదు సైన్యం,బును క్షోభింపంగఁ జేసె ♦ భూరిశరములన్. ౧౹

క. అనిలుఁడు వృంతమునుండియొ, యనుపమగతి పండ్లు రాల్చు♦నట్లుగ నతఁడున్
వనచర ముఖ్యుల శిరములఁ, దనువులనుండి వెడలిపడఁగ ♦ దా శరవితతిన్. ౨౹

క. ఒనరించెఁ దీవ్రకోపం,బునఁ గొందఱు వానరుల వి♦భూషితభుజపం
క్తిని మూఁపులఁ బార్శ్వములను,ననుపమ బాణములఁ జెండె,♦నంతహరివరుల్.

తే. అమ్మహాపార్శ్వబాణవ♦ర్షాగ్ని తాఁకు
లగుచు భీతివిషాదముల్ ♦ తగఁగ విముఖు
లయి ధరిన్ సోలి, రంత మ♦హాభుజుండు
వాలితనయుండు రాక్షస♦బాణతతుల. ౪౹ 4325

తరల. తనబలంబులు బాధచేతను ♦ దారుణాహవభీతిచే
మనములందు నిరాశఁ గైకొని ♦ త్రాసవలిం బడియుండఁగాఁ
గని సముద్రము పర్వమప్పుడు ♦ గాఢవేగము గాంచురీ
తిని జవంబును జూపనాగెను ♦ దీవ్రశక్తి చెలంగఁగన్. ౫౹ 4326

చ. సరసిజమిత్రభావితతి♦చందమునం దగి యాయసంబునౌ
పరిఘము నొక్కదానిఁ గొని ♦ హేమపట్టబంధురాచరణ వైచె నా
సురరిపుపైఁ బడన్ గుమతి ♦ స్రుక్కుచు దాన విసంజ్ఞుఁడౌచు నా
యరదమునుండి క్రిందఁబడె ♦ నాతనిసారథియున్ ధరింబడెన్ ౬౹ 4327

క. ఘనబలుఁడై నీలాంజన,ఘనసదృశుఁ డైన [illegible] ♦ దారుణవిక్రమం
బునఁ దగిన జాంబవంతుఁడు, ఘనమగు గిరినొప్పు భల్లు♦కపుంగవుఁ డుద్ధతిన్. ౭౹

ఆ. వదలి వేగ వచ్చి ♦ వారనిక్రుధచేత, భూధశిఖరమట్లు ♦ పోలుచు విశాల
శిలను గైగ్రహించి ♦ చేరి మహాపార్శ్వ నశ్వరథము లడఁగ♦నట్లు వైచె

క ఘనబలుఁడు మహాపార్శ్వం, బని నందు క్షణంబులోన ♦ నాత్మజ్ఞానం
బును బొంది యంగదుని నొం,చెను బహుసాయకములేసి ♦ శీఘ్రం బలుకన్.

ఆ. పగులఁ గొట్టునట్లు ♦ ఘనుసింహ... ల్, చేసి రసురాళ్ల ♦ ...
నంతసమున నార్చు ♦ చందంబునం, నమవాత నసురనాధ ♦ వైరి యపుడు.

క. దనుజులు కపులును గావించిన సింహారవంబును విని ♦ చెలఁగెడుకోపం
బున మరల నభిముఖుండై, యనిసేయఁగ నిలిచె ధైర్య ♦ మధికముగాఁగన్.

తొంబదితొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

## ౧౦౦ - వ సర్గము.

రామరావణమహాయుద్ధము.

సీ. అమ్మహాసంగర ♦ మందు మహాబలుండయి వీరుఁడగు విరూ ♦ పాక్షుఁ డవల
నమ్మహోదరుఁడు మ ♦ హాపార్శ్వుఁడును హతులగుటయుఁగని రావ ♦ ణాసురుండు
మిగులఁ గ్రుద్ధుండయి ♦ మించెడు కడఁకతో నరదంబుతోలు మా ♦ యనుచు సార
థిని హెచ్చరించి యి ♦ ట్లనిపల్కె వానితో, నా రాము నతనిస ♦ హజుని బొంది
ఆ. నిహతులైన మంత్రి ♦ నికరముయొక్కయు, ముట్టడింపఁబడిన ♦ యట్టిపురము
యొక్కదుఃఖములను ♦ నుక్కడఁగించెద,, స్థిరపదంబు నేను ♦ జెందువాఁడ 3

సీ. *వైదేహిపుష్పస ♦ త్ఫలమయి సుగ్రీవజాంబవత్కుముదులు ♦ నాధ్వసకర
విక్రమాఢ్యులు గాఁగ ♦ వెలయుమైందద్వివిదాంగద నళసుషే ♦ ణానిలసుత
గంధమాదను లన్య ♦ కపులు ప్రశాఖలు గలదియౌ రామవృ ♦ క్షంబు సుమ్ము
దాని కాధారమై ♦ తనరుశాఖాదుల ఖండించువాఁడ సం ♦ గరమునందు
తే. ననుచు నతిరథవర్యుఁడై ♦ యలఘురావ,ణాసురుఁడు రథవరమున ♦ నఖిలదిశలఁ
బ్రతిరవంబులు పుట్ట జ ♦ వమునఁ బోయె, వైరియగురామచంద్రుని ♦ జేరనంత

క. అనిన్వనమున శైవలి,నీనికరగిరీంద్రవిపిన ♦ నియుతగజకిటి
త్వానాథముఖమృగాన్విత,మై నిఖిలధరాతలంబు ♦ నందెఁ జపలతన్. ౫ 4347

క. దనుజేంద్రుఁ డంత భయదం, బనూనదారుణమునౌచు ♦ నరిమృత్యువునై
తనరెడుతామసనామక,ఘనాస్త్రమును వైప నద్ది ♦ కాల్చెం గపులన్ ౬

క. నలుఁగడలం ద్రెళ్లిరి వా,రలు, బ్రహ్మయుఁ దానె మున్వ ♦ రమాయి చెలఁగుదా
నిలలిన్ నిర్మించెను ని,స్తులమగు దానిన్ వహించు ♦ చొప్పు కలుగమిన్. ౭

ఆ. భంగమొంది కపులు ♦ పాఱఁగా ఘోరర
జంబు గలిగె, నిట్లు ♦ సకలకపులు
తచ్ఛరాళిచేతఁ ♦ దాగు భంగము నొంది
యుండఁ గాంచి రాఘ ♦ వుండు కడఁగి ౮ 4350

---

* రామవృక్షం తతో వాన్మి సీతాపుష్పఫలప్రదమ్, ప్రశాఖా యస్య సుగ్రీవో జాంబవాన్ కుముదో నళః, మైందశ్చ ద్వివిదశ్చైవ-అనియూ ఇచ్చట వాస్తవార్థము సుగ్రీవాదులగు ప్రశాఖలఁ బొరియించెదననియు రామవృక్షము ముక్తిఫలప్రదమనియు రావణునిభావమని మహేశ్వరతీర్థులు.

ర్తురఁ బోలియుంచెడు రాముని, పరిసరమున కేగి క్రోధ♦భారముచేతన్. ౨౧౪

క. అగణాత్ముండై భూవర, సగ్రాపై శరవృష్టిఁ గురిసె, ♦ వైరివనజభీ
కరచాపద్యుతదారుణ, శరధారలు సందు లేక ♦ చను దేరంగన్. ౨౨౪ 4364

క. కనుఁగొని నిషంగయుగ్మం, బునుండి భల్లములఁ దీసి ♦ పూనిక మెఱయం
గను నంతఁ గుపితములు భీ, తిని గల్గఁగఁ జేయునవియుఁ ♦ దీక్ష్ణతరములున్.

క. ఘనకాంతుల మెఱసెడు నవి, యును బాములఁ బోలియున్న ♦ యుగ్రశరములన్
దునిమెన్ భల్లంబులచేఁ, దనశక్తి చెలంగ, భూప♦తల్లజుఁ డంతన్. ౨౮ 4366

క. దనుజోత్తము, రావణుఁ డా, జనపతి, వేవేగ వివిధ♦శాతశరములన్
గనలుచు మార్గాని నొంచిరి,, జనపతిదనుజాధిపతులు ♦ శౌర్యము పొంగన్

సీ. అప్రతిహతులయి ♦ యాశుగ వేగముల్ వారించుచుం జిత్ర♦భంగిఁ జాల
పర్యంత మలసటఁ ♦ బడలక సవ్యాపసవ్య మండలములఁ ♦ జతురిమ తగఁ
జరియించుచుం బోరె,♦రిరువురుయయుమ మనాతనిగర్వ మడఁచిన ♦ దర్పహారుఁడు
వోలె భయంకరు♦లై లక్ష్యశుద్ధుల శరముల వదలుచు ♦ సత్వరముగఁ

తే. దలఁపడుచుఁ బోరుచుండఁగ ♦ నవసరము
ననుఁ గనుంగొని భూతాళు♦లును భయంబు
నొందె, వర్షర్తువునను వి♦ద్యుత్ప్రతతులఁ
గలిసి ఘనములు గ్రమ్మిన ♦ కరణి దోఁప ౨౭౪ 4368

క. సురపథమున నానావిధ, శరములు పడి నిండె, నా♦సంజనిత బాణో
త్కరములు వ్యాపించుచు నం, తరములు నంటందునుంటఁ ♦ దదవసరమునన్.

తే. తగ గవాక్షము లలవరిం♦పఁగఁ జెలఁగెడు
విధమునం జూడఁ దగియుండె, ♦ వేఁడివెలుఁగు
పశ్చిమాశకుఁ జేరంగఁ ♦ బదపడి గుహ
జలదములు లేచి నీటిధా♦రలను గురిసి. ౨౯౪ 4370

చ. ఘనమగునంధకారమును ♦ గల్గఁగఁ జేసినయట్లు వార ల
త్యనుపమ వేగవంతము ల♦హార్యము లెంతయు దారుణాకృతుల్
చన ననుకూలమౌ పగిదిఁ ♦ జక్కనిగృధ్రపతత్త్రిపత్త్రముల్
గనఁబడుచుంటఁ బటుములు ♦ గల్గినవై పశితాగ్రముల్ తగన్ ౨౯౪ 4371

క. తనరుశరంబుల వైచుచు, నసిత ధృతపుంఖులన్ భ♦యంకరగురి
తిని గన్పడఁగాఁ జేసిరి, మనుజేశ్వర దనుజనాథ♦ులందను లంతన్ ౩౦ 4372

క. ఇతరేతరవధకాంక్షలు, మతులం బూనిన నృత్త♦మానవులు వోలెన్
జతనంబుగఁ బోరాడిరి, నరవర సాదృశ్యమగుమ ♦ నయ్యని తనరెన్.

తే. మిఱి యనానాస్త్రమై యుండె, ♦ మహితచాపు
లఖిలశస్త్రాస్త్రకోవిదు ♦ లఖిలశస్త్ర

విద్విరిష్ణులుగా వాగు ♦ వేయుచుంట
నని సమానంబుగా నుండి ♦ రంత వాకు ౩౪ 4374

సీ. ఏయేపథంబున ♦ నేపున జరియించిరో యాపథమున నసి ♦ యాయపార
జలధులనుండి శ్వ♦సనజవంబునఁ దరంగములు లేచెడు భంగి ♦ కాండపంక్తు
లట్టి పర్వ్వమునుండె, ♦ నంతట లోకవిద్రావణుం డగునట్టి ♦ రావణుండు
కరమున బాణమో♦క్షణము చేయుచు రాఘవునిలలాటంబునఁ ♦ బూని బాణ

ఆ. పంక్తి గాఁడనేసె, ♦ భయదగాఢనిరను
ర్గళితరుధిరయాభ♦కాండపంక్తి
యదియు రాముశిరము♦నందు నాటిన నాతఁ
డొందఁడయ్యె వ్యథను ♦ డెందమందు ౩౫ 4375

చ. గురుతర తేజముల్ రిపుల♦గుండెలఁ జెండెడు వీర్యముల్ నిరం
తరాములరాకు రాఘవుఁడు ♦ దారుణమై తగురౌద్రమంత్రముల్
వరుస జపించి యస్త్రమును ♦ బాగుగ రౌద్రము నుంకఁజేయుచుర్
శరములఁ దర్భవంబులను ♦ జాపము లాగుచుఁ గోపయుక్తుఁడై ౩౬ 4376

క. దనుజాధిపుపై వైచెను, చనియాబాణములు భూరి♦జలదము నా నొ
ప్పిన రావణుకవచవరం,బును వైరికిభేద్యమును స♦మూహాము గాఁగన్. ౩౭

ఆ. తాఁకి తద్బలమున ♦ దానవునకు నంచు,కంతయేని వ్యథను ♦ నపుడు కల్గఁ
జేయఁజాలవయ్యె, ♦ నాయన ముఁడు నప్పు,స్వాస్త్రకుశలుఁ డౌట♦నంతఁ బోక.

క. మరలను స్యందనగతుఁగ,న్బరపతినిం జూచి ఫాల♦మునఁ బరమాస్త్ర
స్ఫురణమునఁ జాలనొప్పెడు, పరమంత్రముచేతఁ బొల్చు ♦ బాణమువైచెన్.

క. శరము లవి యస్తరూపము, లురగతి రానఱుసిశరము ♦ లుర్విఁ బడఁగ న
త్తరుణమునఁ జేసి యసురే,శ్వరవారితములయి కోప♦భావమువలనన్. ౩౯

తే. ఊర్పులను బుచ్చుచున్న య♦త్యుగ్రపంచ
శీర్షసర్పము లట్లుగ ♦ క్షితిని జొచ్చె,
రావణుం డట్లు రాఘవా♦స్త్రముఁ జెండి
క్రోధమూర్ఛితుఁడయి మహా♦ఘోరముగుచు ౪౦ 4381

క. అరిభీకరమయి తగు నా,సురనామాస్త్రమును వైచె ♦ సౌరిదిగ దానన్
గరివైరితరక్షుభయుం,కరముఖములు గృధ్రకంక♦కాకముఖములున్ ౪౧

సీ. శ్యేనాననమ్ములు ♦ చిత్రవంచకముఖములు నా దోఁడేళ్ల మో♦ములును నివృత
ఫణివక్త్రములు నైదు♦పడగల సర్పము లట్టి యాకృతికల్గి ♦ యతిరుతీవ్ర
శరములుసుజేయు♦శరబాణములు పెక్కు జనియించి వెడలె, దేజ♦మున మిగుల
వెలయునా రావణుఁ♦డలుగుద్రు బోలుచు నాగ హాంబులు బూని♦యహివిధమున
నూర్పులు పుచ్చుచు ♦ నురుశస్త్రమహిమమునను ఖరకిటిలప♦నముల శ్వాన

తే. మకరకుక్కుటముఖముల ♦ మఱియు సర్ప
ముఖములను దగునాయక♦ములను నక్ర
శరములను దారుణాగ్రముల్ ♦ పరఁగువానిఁ
బుట్టఁగాఁ జేసి వైచె రా♦మునిపయిఁ గడు ౮౩॥ 4383

క. ఆరీతి నాసురాస్త్రము, దారుణగతిఁ జెంతఁ జేర ♦ దహనాభుండౌ
శ్రీరాఘవుఁ డుత్సాహము, భూరితరం బొదుచు వెలయఁ ♦ బూనికమీఱన్.

తే. వైచె నాగ్నేయమను నస్త్ర♦వరము, దాని
మహిమమున నగ్నిదీప్తాస్య♦మిహిరవక్త్ర
చంద్రలపనార్ధచంద్రచం♦చన్ముఖములు
ధూమకేతుముఖంబులు ♦ తోఁచునవియు. ౮౫॥ 4385

క. తారాగ్రహవక్త్రంబులు, దారుణతీక్ష్ణోల్కలట్లు ♦ తగుముఖములు గం
భీరతటిజ్జిహ్వాగ్రాకారములునునైన సాయ♦కంబు లితరముల్ ౮౬॥ – 4386

క. జనియించె, నాసురాస్త్రం, బునఁ బుట్టిన భయదబాణ♦ములు నటు శ్రీరా
ముని పావకాస్త్రసంగతిఁ, గనినంత సహస్రశకల♦కములయి యండే.

క. విలయము నొందెను, గృత్యేంబులఁ జులకనఁగా నొసర్పు ♦ భూపతి రాముం
డల యాసురాస్త్రమును నిష్ఫలముగ నడఁగింపఁ గాంచి ♦ పటురభసమునన్.

ఆ. కామరూపులైన ♦ కపినాథముఖవీరు, లామహోత్సుకుట్లు ♦ నపుడు చేరి
హర్షమునఁ జెలంగి ♦ యార్చిరి, శ్రీరాముఁ, డమ్మహాహవమున♦యందు మిగిలి.

చ. దనుజపతిప్రయుక్తమగు ♦ దారుణబాణము నిష్ఫలంబుగా
నొనరిచి సంతసంబుఁ గనె ♦ నొయ్యన వానరవీరు లందఱున్
మనుజపతిప్రయుక్తమగు ♦ మానితపావకబాణశక్తియుం
గని ముదమొంది యార్చిరి న♦కాసము శత్రుభయంకరంబుగన్. ౯౦ 4390

నూఱవ సర్గము సంపూర్ణము

---

## ౧౦౧ - వ సర్గము.

లక్ష్మణ మూర్ఛ

క. అసురేశుఁడు రావణుఁ డ, ట్లసమంబగు నాసురాస్త్ర ♦ మనిఁ బ్రతిహతమై
వెస నడఁగఁ గాంచి ద్విగుణిత, మసారమును నైనక్రోధ ♦ మడరుచునుండన్.

క ఇతరాస్త్రమ్మును వైవఁగ, మతిలో నూహించె, నంత ♦ మానిత తేజం
బు తగన్ రావణుఁడు మయకృతమగు రౌద్రాస్త్రంబు భీష♦ణ ప్రకాశరంబున్. ౧॥

క. ఆరామునిపై వైవఁగాఁ, దా నది సారించె, నంతఁ ♦ బెచ్చాఱుమునన్
భీకరములు దీప్తములు న నద్భుతములు లిత నాళ్లు♦తగునవి యుగుచున్. ౩॥

ఆ. ముసలశూలగదలు ♦ వెస జనియించెను, బ్రహ్మకాలపవన♦భంగి వివిధ
దారుణాకృతులయి ♦ తగుకూటపాశము,ద్గరము లశను లొదవెఁ♦గడుజవమున.

చ. సిరి తగఁ గాంతి పెంపెసఁగఁ ♦ జిత్రమహాస్త్రవిదుత్తముండుగాఁ
బరఁగెడు రాఘవుం డపుడు ♦ భాసురమై పటురూప మొంది యు
ర్వరిసకలాస్త్రవర్యమయి ♦ వర్ధిలు నొక్క మహాస్త్రమేసి యా
సురరిపుసాయకావళులఁ ♦ గ్షోణిపయిం బడఁజేసె నుద్ధతిన్. ౫ 4395

తే. అద్ది గాంధర్వమను పేర ♦ నలరు, దాన
నస్త్రమహాత్ముఁడు రాఘవుఁ ♦ డట్లు రౌద్ర
వశరంబును జెండిన ♦ సురవిరోధి
క్రోధతామ్రాక్షుఁడై రాముఁ ♦ గూల్చె మదిని. ౬ 4396

క. సౌరాస్త్రముఁ బరఁగించెను, భూరిజవుం డతులనూత్న ♦ బుద్ధియునగునా
వీరునిచాపమునుండి మ,హోరాజితచక్రములు బ ♦ యలు వెడలెఁ దగన్. ౭

క. అనుపమకాంతిఁ జెలంగుచు, నినచంద్రగ్రహములట్టు ♦ లెనఁగు విశిఖపం
క్తి నిఖిలదిక్కుల నిండఁగఁ, గన నినశశిఖేచరములు ♦ తమఁ బడురీతిన్. ౮

క. వెలసెను నారాముం డి,మ్ముల సేనాముఖమునందుఁ ♦ బొలిచి దనుజను
జ్జ్వలిసాధనముల బాణం,బులచే ఖండించె శౌర్య ♦ ము గడు మెఱయఁగన్. ౯

చ. దనుజవరుండు రావణుఁడు ♦ తన్మహితాస్త్రము గూడ వ్యర్థమై
చనుటయు రామునర్మము ♦ సంఘమునన్ దశతీవ్రబాణముల్
జొనుపుచు నొంచె నంత రణ ♦ శూరుఁడు రాముఁడు వైరిభీతికృ
ద్ధనువుననుండి వెల్వడిన ♦ దారుణబాణశతాభివిద్ధుఁడై. ౧౦ 4400

క. గురుతేజుఁ డౌట దానికిఁ, బరికంపింపక యె నిల్చె, ♦ బవరంబులఁ దా
నిరతము జయమందెడు రఘు,వరుఁ డతికోపమున దనుజ ♦ వరునం గాలిన్. ౧౧

క. పలువిధములైన బాణం,బుల నొప్పించెను, మహీశ ♦ పుంగవుఁ డిటు ల
ప్పలలాశను నొంచిన తఱి, నిలాధపానుజుఁడు సాధు ♦ హితకరుఁ డంతన్. ౧౨

క. అరివీరుల నొంచెడు దు,ర్భరబలమున నొప్పియుంట ♦ రయమునఁ గొనియెన్
శరసప్తకమును నంతట, గురుతేజుం డతఁడు మదిని ♦ గుతుకం బలరన్. ౧౩

తే. అధికవేగంబుగల్గిన ♦ యాశరముల
మనుజశీర్షాంకితధ్వజం ♦ బును దదీయ
మును శకలములుగాఁగఁ గూ ♦ ల్చెను; మఱియును
గురుబలాఢ్యుఁడు శ్రీమంతుఁ ♦ డురుతరమతి. ౧౪ 4404

క. ఐనట్టి లక్ష్మణుఁడు తన, మానసమునఁ గల్గుక్రుధను ♦ మండింపుచుఁ బెం
పూనిన శరమును నొక్కఁడు, జ్యానాదం బడర వింట ♦ సంధించి తగన్. ౧౫

తే. జ్వలితకుండలమైన రా ♦ క్షసవరేణ్యు, న రథిశిరంబు ఖండించె, ♦ భూరినిశిత
బాణపంచకమున ద్విప ♦ వరకరాభ, దానవేంద్రధనున్ను ను ♦ ద్ధతిని ద్రుంచె. ౧౬

చ. ధను విటుపోవనున్న తఱిఁ ♦ దర్దుము వేగముమీఱ దాఁటి యా
తనిగురుసైంధవాళి నసి♦తంబగు నభ్రము రీతి శైలమో
యను నటు లంగముల్ తనర ♦ స్యందనవక్త్రము లాగుచుండు దా
నిని గదచే విభీషణుఁడు ♦ నెట్టన మోఁది వధించె నుద్ధతిన్. ౧౭ 4407

ఆ. వేగవంతుఁడైన ♦ విబుధవైరిసహోదరుఁ, డశ్వవిరహితమగు ♦ నమ్మహారథమ్మునుండి దుమికి ♦ ధరణికిఁ గమ్ముల, నయి మహోగ్రహంబు ♦ పర్వ నిలిచె. ౧౮

సీ. అంతమహాశక్తి♦నంతుండు విక్రమా,ధనుఁడు నౌ రావణుం ♦ డనుపమాన
మయి వజ్రమట్లు చె♦న్నాగుచు నున్నశక్తిని విభీషణునిపై♦యిని బ్రయోగ
మును జేసె, లక్ష్మణుం♦డును విభీషణునిచెంతకు నది రాకముం♦దటనె దాని
బాణత్రయంబున ♦ భంజించె, నప్పటిరణమున నఁ గపులయా♦రవము లెసఁగెఁ,

తే. గనకమాలాభిలంకృత ♦ మనుపమాన
మైన యాశక్తి ముత్తుని♦యలు నగుచును
విస్ఫులింగము లాకరీతి ♦ వెదల నుల్క
వలె జ్వలించుచు దివినుండి ♦ పడియె ధరణి. ౧౯ 4409

క. తరువాత దానవేంద్రుఁడు, సుసుచిరచందనముఖాభి♦శోభిత మగుచున్
బరఁగుచు యమునకు నైనను, దురాసదం బౌచు నొప్పఁ ♦ దోరపుశక్తిన్

క. చేకొనియె, నద్దినైజ,ప్రాకటతేజమున మిగుల ♦ భాసురమగుచున్
బాకారికులిశమటు తగి, యాకరణిం జేరరాని♦దై యయి మిగులన్. ౨౧ 4411

క. దనుజేంద్రుఁడు గిరగిరఁ ద్రిప్పిన మంతమ ఘోరరూప♦పృథులం బగుచున్
గనుపట్టె, నంతలో రామునితమ్ముఁడు వీరుఁ డార్తి ♦ మునిఁగెడువానిన్ ౨౨

క. దనుజవతంసు విభీషణు,మనమున ననుసంశయంబు ♦ మైకొన భయముం
గనియున్నవానిఁ గని యా,తని కడ్డము వోయి నిల్చె ♦ ధైర్యముపొంగన్

క. వీరుఁడు లక్ష్మణుఁ డంతట, సారంబగు ధనువు లాగి ♦ శక్తిం గేలన్
సారించుచున్న యారక్షోరాజుపయిం బృషత్క♦కూటనువృష్టిన్ ౨౪ 4414

క. కురిసెను మహాత్ముఁడగు రఘు,వరుతమ్ముం డతనిపైన ♦ బాణవితతులం
బరఁగించుచుండఁగ సహో,దరునిపయిన్ విక్రమంబుఁ ♦ దాఁజూపంగన్. ౨౫

తే. వీలులేకుంటచేత వి♦భీషణు నని
నొంచుయత్నంబు మాని ద♦నుజవిభుండు
తనసహోదరుఁ దప్పించి ♦ ధైర్యమూని
నిలిచియున్న లక్ష్మణుఁ జేరి ♦ పలికె నిట్లు. ౨౬ 4416

క. బలముగలవాఁడ ననుకొని, చెలఁగుచు నాతమ్ము నిట్లు ♦ జృంభచ్ఛక్తిం
గలిగినయటు తప్పించితి, పలలాశను వీని విడిచి ♦ పటుతరశక్తిన్ ౨౭ 4417

క. దీనిన్ నీపయి వైచెద;, మానక యాశక్తి మున్ను ♦ మహిఁ నెందఱినో

తాను బొలియించి రక్తము,లోకక్ష ముగ్నిపది సూమ్ము ♦ లోకనుతంబొ ౨౮

చ పరిఘము లట్టి నావయిన ♦ బాహువరంబుల వీడి యుద్ధి భీ
కరముగ నీదువక్షమును ♦ గ్రన్ననఁ జీలిచి రక్తసిక్తమై
యరుగుచుఁ దావకానువుల ♦ నాకృతిమైఁ గొని యేగఁ జాలునం
చురవడిఁ బల్కి కోపమున ♦ నుగ్రతనుండయి దానవేంద్రుఁడుక్. ౨౯ 4419

క ఎనిమిదిగంటలతోఁ దగి, ఘననాదమ్ము గలిగి మయ♦కల్పితమాయా
జనితంబయి వైరితతిం, దునుముచు వ్యర్థముగ రాక ♦ తోరపుశక్తిక్. ౩౦

క. పరఁగుచు స్వతేజమున భీ,కరముగఁ గ్రాలుచును జెలఁగుఁ ♦ గడువడి దానిక్
గురుజవమున లక్ష్మణుపైఁ, గర ముగ్రుండగుచు వైవ ♦ గాఢరవమునక్. ౩౧

తే. భీమవేగంబుచం బొల్చి ♦ వృత్రహరుని,వజ్రమట్లుగ మ్రోఁగుచు ♦ బవరమందు
నున్న లక్ష్మణుపైఁ జనె, ♦ నుగ్రరీతి, వచ్చునాశక్తిఁ గని రఘు♦వరుఁడు మదిని.

క. నాయనుజునకుక్ మంగళ, మీయెడ నౌఁగాక యనుచు ♦ నెనఁగెడు శక్తిక్
వే యడరుదాని గూరిచి,నీయుగ్రాహంనోద్యమంబు ♦ నిష్ఫలమగుతక్ ౩౩ 1423

తే. వ్యర్థమగుదువుగాక నీ♦వనియె నపుడె,
యంత రావణుఁడుగ్రుఁడై ♦ యహిసమాన
శక్తి దానిని వైవ నా♦శక్తి,క్షణము
లోన నెవ్వరినైనఁ గా♦ల్చునది యయ్యు ౩౪ 4424

క మనమున రాముఁడు వ్యర్థము,గను జేయుట నపుడు భయశ♦కలమేని మనం
బున లేక శూరుఁడై పి,ల్చిన లక్ష్మణునురముఁ నందుఁ ♦ జేరి మునింగెక్. ౩౫

తే. మిగులజవమున గురుకాంతి ♦ మించుచున్న
యామహాశక్తి ఫణిపతి♦యైన యాది
శేషునాలుకవలెనె వి♦శేషభీతి
కరముగాఁ దేజరిల్లి ల♦క్ష్మణునురమున ౩౬ 4426

సీ. వడిఁ బడె, నారఘు♦వంశమ్ముఁడంత రావణుహస్తజవమున ♦ వచ్చి చాల
లోఁతుగాఁ దిగిబొమ్ము ♦ నాతిటి భేదిం ధరశైపైఁ బడియెఁ, జెం♦తనె వసించి
యున్న శ్రీరాఘవుం ♦ డుకుతర జులంపు పమ్ముఁ నంతటి యవ♦స్థను గనంగఁ
గని,భ్రాతృవాత్సల్య♦మున విషణ్ణుండయ్యెనాత్మను, నతఁడు బా♦ష్పాకులాక్షుఁ

తే డయి ముహూర్తము దాను జే♦ఁ దగుపనిని
నెంచి ప్రళయాగ్ని భంగిని ♦ మించి మిగుల
నురువడింపఁగఁ బూనె భూ♦వరుఁడ దుఃఖ
సమయ మిది కాదటంచుఁ దా ♦ స్వాంతమందు ౩౭ 4427

క. తలపోసి భూమినుత దొం,గిలుటయుఁ దనసోదరుండు ♦ క్షితిఁ బడుటయు ని

* స్వస్త్యస్తు లక్ష్మణాయేతి మోఘాభవ హతోద్యమా-అనియూ.

మ్ములఁ జూచుటఁ బట్టియు మిక్కిలి యుత్సుకమీఱ నుదిరి ♦ గెరలుచు నపుడే

క. దనుజుని వధింపయత్నం,బుననే యేసుటకు తూపు ♦ ముగ యుద్ధముచే
సెను, నట్లన రాముం డా,యతమైన శక్తిప్రభిన్నుఁ ♦ డై సోదరుఁడున్. ౨౦

తే. రక్తసిక్తాంగుఁడగుచు స♦ర్పయుతశైల
మట్లు లక్ష్మణుఁ డుండంగ ♦ నచటఁ గాంచె,
నాకపిశ్రేష్ఠు లెల్ల బ♦లాఢ్యుఁడైన
దనుజనాథప్రహితశక్తి ♦ దానిఁ బూన్కి. ౨౧ 4430

క. ఉరమువనుండి ప్రయత్నము, పరమంబుగఁ జేసి వెఱుచు ♦ బలము కలుగమిన్
విరహితఫలురై యంతటఁ, గరలాఘవ మొప్ప దనుజ♦కాంతుఁ డలుకతోన్

క. శరములు వైచి కలంచుట, నురుశక్తిని వెఱువఁజాల ♦ కుండిరి, మఱియున్
వరశక్తి యద్ది లక్ష్మణు, నురమున్ భేదించి చొచ్చె ♦ నుర్వీస్థలిలోన్ ౨౩

సీ. బలవంతుఁ డా రాముఁ ♦ డలఘుసంగరమునందుఁ గ్రుద్ధుండయి ♦ యతిభయంక
రమగు నాశక్తిఁ గ♦రంబులచేఁ బట్టిలాగి వేవిఱిచె, ని♦లాధవుండు
దాని లాగుచునుండ ♦ తఱి మహాబలవంతుఁడగు రావణుండు స♦ర్వావయవము
లందు నాటెను సాయ♦కావళియుర్మముల్ భేదించుదాని, నా♦పెనుశరములు

తే. సరకుసేయక రాముఁడు ♦ సహజు గౌఁగి
లించుకొని సూర్యతనయు గా♦లికొడుకును ని
తరహరీంద్రులఁ గాంచి నా♦తమ్ము నితని
జుట్టుకొని కపివరులార! ♦ పట్టుడలను ౨౫ 4433

క. పరిరక్షించుచు నుండుఁడు,, చిరకాలమునుండి వృష్టిఁ ♦ జిత్తమునందుం
గరముం గోరెడుచాతక,వరపక్షికి ఘర్మము చన ♦ వారిధరంబుల్. ౨౬

చ. కనఁబడినట్లు నేను జిర♦కాలముగా మదిఁ గోరుచుండుఁగా
వున నిట నాకువిక్రమముఁ ♦ బొల్పుగఁ జూపఁగఁ గాలమబ్బె ని
య్యనిఁ నీకఁ బాపనిశ్చయుని ♦ నాశరపర్యుని వీనిఁ జంపనో,
వనచరులార! మీయెదుటఁ ♦ బల్కెద సత్యముగాఁ బ్రతిజ్ఞనున్ ౨౭ 4435

తే. ఈక్షణమునందె మీరెల్ల ♦ నీజగమున
రావణాసురుఁడో లేక ♦ రాఘవుండో
యుండకుండుటఁ గనఁగలరు, ♦ దుర్వినీతు
రుండ రిఁకమీఁద నని యెఱుఁ♦గుండు మదుల ౨౮ 4436

సీ. రాజ్యనాశము మహా♦రణ్యవాసంబును దండకావనపరి♦ధావనంబు
సీతయన్యులచేత♦స్పృశియింపఁబడుటయుఁ గ్రూరరాక్షసులకుఁ జి♦క్కుటయు బంప

* అరావణ మరామం వా జగద్ద్రక్ష్యథ వానరాః - అని మూ.

పరిసరంబున నున్న ♦ గురువనంబు దునుము గ గుశేరదుఃఖాళి ♦ నొందుటయును
నరకంబువలె ఘోర♦తరమైన కారాగృహనిపతనంబున♦ నంగలిగిన
తే. యట్టి క్లేశము సర్వమ్ము♦ ముని రావణుని వధించి త్యజించెద ♦ వినుఁ డెవనికిఁ
గాను నేసంగరంబునఁ ♦ గపివతంసు, వాలిని వధించి సుగ్రీవుఁ ♦ బతిగఁ జేసి.

క. ఈనిఖిలకపిబలంబుల, నేనిచటికిఁ దెచ్చితినొ మ♦ఱెవ్వరికిని గా
నీనీరనిధికి సేతువు, జానుగ బంధించి దాఁటి ♦ సత్వర మిటకున్ ౫౨
తే. అరుగుదెంచినవాఁడనో ♦ యట్టిపాపి
దానవుం డిప్డు నాదునే♦త్రపథమందుఁ
బడియె, విషదృష్టిగలమహో♦ఫణులదృష్టి
ప్రాణి హరియించువట్లు నా♦ బారిఁ దగిలి ౫౩ 4439
క. దనుజుం డీతఁడు ప్రాణము,లను దాలిచి యుండలేఁ డి♦లాస్థలి నింకన్
వినుఁ డిదె దుర్ధర్షమహా,వనచరులారా! గిరీంద్ర♦వరశిఖరములన్. ౫౪
ఆ. కూరుచుండి సుంత ♦ కొఱఁతలే కిట నాకు
రావణునకుఁ గలుగఁ ♦ బోవు యుద్ధ
మును గనుంగొనుండు, ♦ మునివరుల్ గంధర్వ
లఖిలచారణులు మ♦హాహవమున ౫౫ 4441

*సీ. ఈజగత్త్రయమున♦ నెసఁగువారం దఱు, రాము రామత్వంబు ♦ గాను మలరఁ
గనుఁగొందురు గాక, లో♦కములందుఁ గల చరాచరములు దేవతా♦సముదయమ్ము
లొకటిగాఁ జేరి యీ♦యుద్ధము సాగిన పద్ధతి నీభూమి ♦ పరిఢవిల్లి
నంతపర్యంతమ♦హరహంబు జగమునఁ జెప్పుకొనంగను ♦ జేయఁ జాలు
తే. నట్టికృత్యము నేనె యీ♦యదనునందు
జేయువాఁడ, నటంచని ♦ క్షితివిభుండు
తప్తకాంచనభూషిత♦దారుణాంబ
కముల సుసమాహితుండయి ♦ కర్బురేశు ౫౬ 4442

క. తలపడి నొప్పించెను, ఘనమ లుజలధారలను మిగుల ♦ భూమి గురియున
ట్టులు రావణుండు రామునిఁ, దలపడి దీప్తాంబరసము♦దాయము లొకటన్.
తే. ముసలముఖములఁ బరఁగించె, ♦ వెస మహోగ్ర
దానవేశ్వరు లొకరి మీఁ♦ద నొకరేఁచి
వైచుబాణంబు లొండొంటి ♦ పరుసఁ గొట్టు
కొనఁగలుగు ధ్వనితుములమై ♦ తనరె నపుడు ౬౦ 4441
క. కనఁగఁ బ్రదీప్తాగ్రములై, తనరెడు వారబ్రపృషత్క♦తతియొక్కటిచే
త నొకటి భిన్నంబై యుర్విని, వింగిసినుండి పడియె ♦ వివిధవిధములన్ ౬౧

* అద్య రామస్య రామత్వం పశ్యంతు మమ కార్ముకే...

క. ఇక్ష్వాకురాజ్యవల్లీస్వాన, ముగ్రతరమ్మై భూతతతుల ♦ కొగి భయగంబై
యరుదిదియనఁ దగి యుండెను,, గురుకాంతుల మెఱయుచున్న ♦ కోదండంబుల్.

చ. కరమునఁ దాల్చి యాధరణి ♦ కాంతుఁడు రాముఁ డుదారచిత్తుఁడై
శరతతివృష్టి సాంద్రముగఁ ♦ జక్కనిలక్ష్యము నూని పర్వఁజే
య రయమునన్ సురారిపతి ♦ యట్లని రాఘవపీడితాంగుఁడై
పరుగిడె వాయుసంహతిని ♦ బాఱెడు మేఘమురీతి భీతుఁడై. ౬౩ 4447

నూటయొకటవ సర్గము సంపూర్ణము

## ౧౦౨ - వ సర్గము.

-- లక్ష్మణుఁడు మూర్ఛనుండి తెప్పిఱిల్లుట --

క. బలయుతుఁడగు రావణుఁ డుజ్జ్వలశక్తిని వైవ దాన ♦ సాంద్రరుధిరధా
రలఁదోఁగి శూరుఁడై దోర్బలలలితుఁడు లక్ష్మణుండు ♦ పడియుంట నిలన్.

క. కని రాముఁడు దుర్మతియగు, దనుజేంద్రునితోడ బెట్టి ♦ దంబుగ యుద్ధం
బును చేసి శరవిమోచనమును జేయుచు నే సుషేణు ♦ ప్రోలఁ గని పగన్. ౨

తే. పలికె నిట్లని యావీరుఁ ♦ డలఘుచిత్తుఁ, డసురనాయకుబలిమిచే ♦ నవనిఁ ద్రెళ్లి
యురగచుట్టులు పొరలాడు ♦ చున్నవాఁడు, పగలు నాకభివృద్ధియా ♦ భంగినిచట.

క. ఇతఁడన నసువులకింటెను, హితుఁడగు నా కిట్టితమ్ముఁ ♦ డిట రక్తపరి
ప్లుతుఁడయి యుంటను గనన్, మతి వ్యాకులమయ్యె నికస ♦ మర మొనరింపన్.

ఆ. కలుగు నెట్లుశక్తి? ♦ కలహంబులన్ శ్లాఘ్య
వర్తనుఁడయి సచ్ఛు ♦ భగుణలక్ష
ణాఢ్యుఁడైన నాస ♦ హాజుఁ డితఁడు మృతిని
గనునయే నసువులు ♦ తనువునందు ౫ 4452

క. నిలిచిన ఫలమే మిఁక? సుఖములు నాకేటికి?, రణాగ్రమున దుర్మతియున్
ఖలుఁడగు రావణుచేఁ గడు, బలయుతుఁడగు నితఁడు నేఁడు ♦ బరిపీడింపన్.

సీ. హతుఁడగుటం జూచి ♦ యతులమామక విక్రమము సిగ్గుపడి వచిం ♦ దమునన్న
యది, శరాసనమును ♦ హస్తమునన్ నిల్వకట్టె జాఱుచునున్న, ♦ దంబకములు
సారహీనములైన, ♦ వారీతిఁ గన్నులు బాష్పములం దోఁగి ♦ బకలుచున్న
వంతియె గాక స్వ ♦ ప్నావస్థయందు సంచారము చేయంగ ♦ జనులయంబు

తే. లట్టె వెన్కకు నీడ్చెడు ♦ నట్లు నా కవయవములు పడిపోయెడు ♦ భంగినున్న
దధికముగఁ జింతపెరుఁగుచు ♦ న్నది పరుషము, గాఁగ నసువులపై నాశ ♦ కదలిపోయె.

క. అని తనను బహిఃప్రాణంబును బిలుచుపోకరుగు ♦ మఁబోలుచు సుమిత్రా
తనయుఁడగు నాగ నెలముల ♦ మునశరములు నాట నారిఁ ♦ గలవల పడుచున్.

తే. ఊర్పులను బుచ్చుచుండంగ ♦ సుగ్రీవ మునఁ
గాంచి దుఃఖాబ్ధిమగ్నుఁడై ♦ చంచలించె,
నట్టులు విషాదమును బొంది ♦ వ్యాకులేంద్రి
యుఁడయి విలపించె రాఘవుం ♦ డొప్పుదప్పి ౯॥ 4456

చ. అనుజుఁడు లక్ష్మణుం డితఁ ♦ డహార్యబలుండయియుఁ మహాసురుం
డని వధియింపఁ బాంసుపట ♦ లాంచితుఁడై పడియుండఁగాఁ
గనుఁగొనుచున్నవాఁడ గద ♦ గాన నిఁకన్ సమరంబుచేత నే
పనిగల దీయనుప్రతతి ♦ భార్యయు నుండిన నేమి లాభమా ౧౦॥ 4457

చ. అనిమొన లక్ష్మణుండు హతుఁ ♦ డై పడియుండఁగ రాజ్యముండినన్
గను ఫలమేమి? ప్రాణములు ♦ గల్గిననేమి? రణంబొనర్చి యే
పని నొనరింతుఁ? జాలు నిఁక ♦ బాహుబలంబును; *దేశదేశమం
దును మదిఁ గోరఁ జిక్కుదురు ♦ తోయరుహాస్యలు భార్య లెందఱో ౧౧॥

క. దొరకుదురు బాంధవులు సో, దరుఁడగు తమ్ముండు దొరకు ♦ ధరణీరాజ్యం
బరసినఁ గనఁబడ దెందును?, దురమునఁ బడె గాదె యిట్టి ♦ తోఁబుట్టు విటన్.

చ అనివిలపించుచున్ బ్రబల ♦ మై తగుదుఃఖముచేత సంగముల్
పెనగతి విహ్వలింపఁ గృప ♦ పెంపెసలారఁగఁ జేయునట్లు మే
దిని బొరలాడుచున్ దనము ♦ దింగల దీంత పోవ నూర్పులిం
తనివచియింపరానియటు ♦ లార్తిని బల్మఱుఁ బుచ్చుచున్ వగన్. ౧౩॥ 4460

క. ధరఁ బొరలాడెడు శ్రీరఘు, వరునిం గని పీడఁడగుచు ♦ భాసిల్లెడునా
హరివరుఁడు సుషేణుం డా, దరమున నూఱడిలఁ బల్కి ♦ తా నిట్లనియెన్.

తే లక్ష్మివర్ధనుఁడైన యీ ♦ లక్ష్మణుండు
కాలగతి నొందలేదు దీ ♦ ర్ఘదృఢబాహు
విలసితా! యేల? యనినచో ♦ వికృతముగను
దగ వివర్ణముగను లేది ♦ తనిముఖంబు ౧౫॥ 4462

తే. కాంతి యింతయుఁ దఱుగదు ♦ గన ముఖమిది
సుప్రభంబయి తనరుచు ♦ సుప్రసన్న
మగుచు నలరారుచున్నది ♦ హస్తతలము
లరుణపద్మములవలెనే ♦ యలరెడుఁ జుము ౧౬ 4463

క కనుయుగము సుప్రసన్నము, గను జూపట్టెడిఁ, మహీశ ♦ గతజీవితులా
మనుజుల కిటులగు రూపము, గనఁబడ దాయుస్సుచక్కఁ ♦ గాఁ గలవారే.

* దేశేదేశేకళత్రాణి దేశేదేశేచ బాంధవాః, తం తు దేశం న పశ్యామి యత్రభ్రాతా సహోదరః-అనియూ.

క. కనఁబడుదు రిట్టిరూపంబున, లక్ష్మీవరసుతుఁడయి ♦ పొలుచు నితఁడు చా
వును బొందలేదు వీరా!, తనపగతురఁ జంపఁగలయి ♦ తఁడు ప్రాణయుతిన్.

తే. బ్రదికియున్నాఁడు దుఃఖింప ♦ వలదు వీర!
యితఁడు స్మృతిదప్పి తనువు నీ ♦ యిలను వైచి
యున్న హృదయంబు పలుకులు ♦ నొగి నెగురుచు
నున్న నటుగాన జీవంబు ♦ లున్న వనుచు. ౧౯ 4466

క. తెలియఁజేయుచున్నది, యని యిట్టులు పలికి సుషేణుండు వాక్య ♦ పటుత నెఱుఁగుటన్
సులలితహానువులు గల్గిన, యలహనుమను బ్రోత్సహించు ♦ చనియెనిటువలెన్.

సీ. ఇటనుండి సౌమ్య! నీ ♦ వేగి శీఘ్రంబుగ మును జాంబవంతుఁడు ♦ గనుఁగొనునటు
తెలిపినయట్టి గు ♦ ర్తులు గల్గి శుభమగు నోషధిగిరి కేగి ♦ యుత్తరాద్రి
యామ్యశృంగంబున ♦ నగపడుచున్ శల్యములు లేకయుండఁ జే ♦ యలలితతను
కలితమైన విశల్య ♦ కరణిని భద్రము లిచ్చుదానిని మఱి ♦ యింతె కాక
రాజిల్లు నా సువ ♦ ర్ణకరణి సంజీవకరణిని సంధాన ♦ కరణి వీని

తే. వీనుఁడో లక్ష్మణునిని జీ ♦ వింపఁ జేయుటకుఁ ద్వరితముగాఁ దెమ్ము ♦ వరతతిహర!
వానిచేత మహాత్ముఁడై ♦ భూనుతుఁడగు, నితని జీవింపఁ జేసెద ♦ నేను గడఁక.

క. అనుచు సుషేణుఁడు పల్కిన, విని శ్రీమంతుండు హనుమ ♦ వేగ తదద్రిం
గనఁబోయి తదోషధి చక్కని యాకృతి తెలియరామిఁ ♦ గడుఁ జింతిల్లెన్.

క. గుహ తేజున గాహనమునకు, ధరశృంగము దీని నే ని ♦ తాంత ప్రౌఢిం
బరఁగుచుఁ గొనిపోయెద భూ,నరుతమ్మున కమితసుఖము ♦ వర్ధిలఁ జేయన్

సీ. శక్తిగల్గిన యోష ♦ ధ్యాకరణి మదీయాంతరకరణ సస్తు ♦ దాదిచిహ్న
ములఁ బట్టి శిక్షింపఁ ♦ గల దిం దెయదియోఁ చూచున్న దిల్లె సుషేణుఁ ♦ డోగి వచించెఁ
గాన నీశిఖరమే ♦ గావలయును నది, యది నాకుఁ దెలియలే ♦ దని మహోష
ధిని దీసికొనక యే ♦ వనచరపుంగవు నడుగుటకై పోవ ♦ నంతలోన

తే. సమయమేగును గాన ల ♦ క్ష్మణున కేమొ
హానిగల్గును బౌరుష ♦ హీనుఁ డనుచు
నను వచింతు రటన్నఁ జ ♦ క్కని మతి యొకఁ
డుద్భవించెను, నంతట ♦ నగ్రబలుఁడు ౨౭ 4471

చ. తనమది నిట్టు లెంచి కపి ♦ తల్లజుఁ డెంతయు వేగమొప్పఁగాఁ
జని యాపర్వతోత్తమము ♦ సన్నిధిఁ జేరి తదీయశృంగమున్
గను గొని మూఁడునాళ్లు నడి ♦ గాఁ గదలించి ప్రఫుల్లవృత్తరా
జనచయముం గ్రమా శిఖర ♦ సత్తము ముం బెకలించి పూన్కితోన్. ౨౮ 4472

తరల. కరముఁ బొంగి బయికెత్తె నంతట ♦ గాఢవిక్రమ మొప్ప నం
బరపథంబుననుండి యాహరి ♦ వర్యుఁ డున్నతశక్తిఁ బు

మ్భరనుపూర్ణవినీలభీకర♦సాంద్ర, వారిదమట్టు లా
ధరమహాశిఖరంబుఁ గైకొని ♦ తాను వచ్చె రయంబునన్ ౩౦౹ 4473

చ. హనుమయు నట్లు వేగమున ♦ నాగిరిశృంగము రామునొద్దకుం
గొని చని యాహరీశ్వరుల♦కూటమునంతరమందు డించి యొ
క్కనిముస మూరకుండి కపి♦కాంతు సుషేణుని గాంచి పల్కె ని
ట్లని, హరిపుంగవా! యచట ♦ నాలతచిహ్నము నే నెఱుంగమిన్. ౩౧౹

క. గిరిదక్షిణశిఖరంబును, బరికించియె దీని నిటకు ♦ వడిఁ దెచ్చితివం
చురువినయంబునఁ బల్కెడు, మరుదాత్మజు హనుమ నతని ♦ మంజులభణితిన్.

క కొనియాడి యాసుషేణుఁడు, చని శృంగము నెక్కి వెదకి ♦ చయ్యన దానిం
గని పెకలించి గ్రహించెను,, ననిమొనఁ గలవనచరేంద్రు ♦ లాశరవరులున్.

క. సురలకునైన నొనర్పను, దరంబుగా నట్టి పవన♦తనయునికి న
చ్చెరువొంది, రంత నవ్వా,నరవరుఁడు సుషేణుఁ డద్రి♦నాథశిఖరమున్ ౩౫

క. పరికించి శదోషధినిఁ, ద్వరఁగా గ్రహియించి నలిపి ♦ వర తేజుండై
పగఁగెడు లక్ష్మణునాసాగ,శరమునఁ బిండెను. మహాద్భు♦తంబుగ నంతన్ ౩౫౹

సీ. పరవిగహాంతియై ♦ పరమశల్యవ్రజముక్తుఁడౌ లక్ష్మణుం ♦ డుజ్జ్వలౌష
ధిని దాని మూర్కొని ♦ తీవ్రశల్యంబులు వదలుట విరుజుఁడై ♦ వసుధనుండి
చివ్వన లేచె, నా♦క్షితినుండి లేచినయాలక్ష్మణుం గాంచి ♦ యఖిలకపులు
బాగుబాగని కపి♦వర్యు సుషేణునిఁ బూజించి, రరివీర♦పూగహరుఁడు

తే రాముఁ డంతట లక్ష్మణు ♦ రమ్మురమ్ము
త్వరగ నని పిల్చి వడిఁ గౌఁగి♦బాష్పములను
గనులు నిండఁగ స్నేహంబు♦నను సహజుని
గౌఁగిలించుకొనెన్ గపి♦కాంతు లలర ౩౮౹ 4479

క. కరములను బట్టుకొని సోదర! వీరా! నీవు పంచ♦తను బొందియుని
త్తరుణమున నాదుభాగ్య,స్ఫురణమునన్ మరల బ్రదుక♦చొప్పు గలిగెఁ జూ!.

క కనుఁగొంటి నిన్నుఁ బ్రీతిగ, విను నీవే మృతిని గనినఁ ♦ బృథ్వీసుతతో
డను నసువుంతో నేపని,యును నాకిఁక లేదు విజయ ♦ మొందఁగ నేమా?.౪౦౹

క. అనియిట్లు మహాత్ముండగు,తనయన్న వచించుచుండఁ ♦ దడఁబడునుడులన్
వినిపించె ఖిన్నుఁడై రా,మునితమ్ముం డన్నకిట్లు, ♦ భూమీశవరా! ౪౧౹ 4482

క. అవితథవిక్రముఁడవు నీ,వు విభీషణునకొడ యనుజ♦భూపతి ననిలో
జవమునఁ జంపి యొసంగెద, సువితత లంకారాజ్యమనుచు ♦ శుభతరభణితిన్

క. వినఁ బ్రతిన చేసి తరుణంబున 'ప్రా' బలము లేక ♦ పొరలాడెదు న
ల్పునియట్టు లివ్విధంబున, ననువగునే చెప్ప? విరహి♦తాఘా! జగతిన్ ౪౩౹

తే. సజ్జనులు వ్యర్థమైనట్టి ♦ శపథమెపుడు, చేయరుగదా? ప్రతిజ్ఞను ♦ జేసి దానిఁ

చక్క నెఱవేర్చుటే గదా? ♦ శౌర్యలక్షణము, మహోత్కృష్ట మదర్థమై♦న పగచేత

క. జనకజయందును విజయం,బునయందు నుపేక్ష నిట్లు ♦ పొందుట యేఁటికిఁ జా
లును రావణుఁ జంపి ప్రతి,జ్ఞను దీర్పుము, దంష్ట్రిలెల్ల ♦ సాధ్వస మొనఁగన్.

తే. అఱచుచున్న పంచాస్యము ♦ సంతికమునఁ
దగిలినట్టి మహాద్విర♦దంబురీతి
నీశరపథంబునం బడి ♦ నిర్గతాసు
వితతిగాకుండ బ్రదుకునే ♦ వినుతుఁడైన ౮౭ 4487

చ. ఖరకరుఁ డాత్మకృత్యముఁ ద♦గంగ నొనర్చి ప్రశాంతి నొందఁగా
వరుణదిశం జెలంగు గిరి♦వర్యముఁ జేరెడు నంతలోన నీ
సురరిపు నీదురాత్ముఁ గడ♦శూరత మీఱ వధించు టొప్పు నే
వరుసగనైన నంచు మది♦వాంఛను నేఁ గనువాఁడ నో ప్రభూ! ౮౮ 4488

చ. దనుజమహేంద్రుఁ జంపుటకుఁ ♦ దథ్యముగా మదిఁ గోరుదేని నీ
వొనరిచినట్టి యీ ప్రతిన ♦ నొప్పుగఁ దీర్పఁదలంతువేని నా
జనకజయందు సమ్ముదము ♦ చక్కఁగ నీకును గల్గునేని జ
య్యనను మదుక్తి చేయఁదగు ♦ నంచు వచింపఁగ నాదరంబునన్. ౮౯ 4489

నూటరెండవ సర్గము సంపూర్ణము.

---

## ౧౦౩ - వ సర్గము

రామరావణులు మహాహవమొనరించుట

క. పరవీరఘ్నుండగు రఘు,వరుఁ డాలక్ష్మణుని సాధు♦వాక్యమ్ముల ని
ర్భరశక్తిమీఱునట్లుగ, శరాసనము నెక్కుపెట్టి ♦ శరములఁ గినుకన్. ౧ 4490

క. సేనాముఖమునఁ బూనిక, దానవనాయకునిమీఁదఁ ♦ దా వైచెను, నా
మానవభక్షకనేత యొ,కానొకయరదంబు నెక్కి ♦ కాకుత్స్థునిపై. ౨ 4491

తే. భాస్కరునిపైని రాహువు ♦ పౌరుషమున
నడరురీతిగఁ బోయె, న♦ట్లసురనేత
యరదముననుండి నీరద ♦ మంబుధార
లను గురియురీతి వజ్రోప♦మాంబకముల ౩ 4492

క. ఘోరంబుగఁ గురియించెను,, శ్రీరాముఁడు రణమునందుఁ ♦ జేరి యవహితుం
డై రావణుపై వైచెను, దారుణశుచితుల్యకనక♦దామాంబకముల్ ౪ 4493

క. ధరరాముఁడు నిలుచుండియె నరదముపై దానవేంద్రుఁ ♦ డలరియు నిటు సం
గరమొనరించుట నను మెచ్చకనను గాంచుచు దేవ♦పరగంధర్వుల్. ౫

తే. దానవులు పల్కి, రంత నెం♦తయు ముదమున
సిరులఁ జెలువొందు దేవతా♦వరురథంబు

నింద్రునానతి మాతలి ♦ హితము మెఱయ
నెక్కి దిగి వచ్చి దివినుండి ♦ యక్కజముగ. ౬ 4495

సీ. కనకచిత్రాంగమై ♦ కమనీయకింకిణీజాలభూషితంబయి ♦ చారుతరము
గాఁ దగి బాలభా♦స్కరురీతి నొప్పుచు వైడూర్యకూబర♦వర్య మగుచుఁ
గాంచనాభరణసం♦కలితంబులై శ్వేతచామరాన్వితములై ♦ సరసిజాత
సఖువలె మెఱయుచుఁ ♦ జక్కనిహయ యూకుపచ్చనిరంగున ♦ భాసిలి తగి

తే. కనకమయహారముల నొప్పు ♦ కిన్నులు తురగ
ములు చెలంగుచు లాగ సు♦జ్వలసువర్ణ
దండలలితధ్వజంబయి ♦ తనరుచుండె,
నంత నింద్రునిసారథి ♦ యరద మెక్కి ౯ 4496

క. మునికోలం గొని యరదంబునఁ జెలఁగుచుఁ బలికె రామ♦మూర్తిం గని భ
క్తిని బ్రాంజలియై రామా!, ఘనబల! శ్రీలలిత! శత్రు♦గణభీతికరా!. ౧౦౻

తే. నీకు విజయంబు చేకూరఁ ♦ బాకవైరి
యీరథముఁ బంపె మఱియు నీ♦యింద్రచాప
మగ్నిసన్నిభకవచ మీ♦యదియు సూర్య
సదృశశరములు విపులశ♦క్తియుతశక్తి ౧౧ 4498

క శతముఖుఁడు నీకు నొసఁగెన్, జతనంబుగ వీని నెల్ల ♦ క్ష్మాపాలవరా!
శతముఖుఁడు మున్ను స్యందన మతులితగతి దీని నెక్కి ♦ యద్భుతరీతిన్.

తే. నేను సారథినై యుండ ♦ నిఖిలదనుజులను వధించెను నారీతి ♦ గను మహాత్మ!
నేనె సారథినై యుండ ♦ నెమ్మి నిప్పు, డీయరద మెక్కి రావణు ♦ నితనిఁ జంపు.

చ అని యిటు పల్కు మాతలిని ♦ నాదృతమై గనియుండ నారథం
బునకుఁ బ్రదక్షిణంబుగను ♦ బోయి నమస్కృతి సల్పి దేహకాం
తిని శశికాంతిచే వలెను ♦ తెల్లముగా జగముల్ వెలుంగఁగా
మన మలరంగ నెక్కి నృప♦మండనుఁ డంతట దానవేంద్రుఁడున్ ౧౪ 4501

మ గురుబాహుబలంపుగు రాముఁడున్ రణముఁ గో♦పమ్ము లీలఁ జేయంగ సం
గర మప్పట్టున రోమహర్షణముగాఁ♦గం దొమ్మిగాఁ జెల్లె, భూ
వరుఁ డారాముఁడు బాసురాస్త్రముల స♦ర్వస్వంబుఁ దా నెమ్మదిన్
గిరమూహింపఁగఁ జాలువాఁడగుటచే ♦ గ్రవ్యాదనాథుం డనిన్. ౧౫

క తనపై వైచిన గాంధర్వనామకాస్త్రమును దాన ♦ వారించెను జ
క్కని దైవాస్త్రము నయ్యస్త్రనిశాతాగ్రమునఁ జెండెఁ ♦ బాలుపులీలన్.

తే. రాక్షసేశ్వరుఁడైన యా ♦ రావణుండు
పరమకోపంబునన్ మహా♦భయముగొల్పు
రాక్షసాస్త్రము వైచె నా♦రాలు నొప్పు
గనకభూషితతద్బాణ♦గణము లపుడు ౧౭ 4504

క. దనుజేంద్రధనుర్ముక్తిని, గని గురువిషసర్పములయి ♦ కడువడి నారా
ముని మీఁదికిఁ బాఱెను దృ, గ్ఘనభుజగము లాననములు ♦ గడుమించంగన్.

సీ. వివృతాననంబులై ♦ వెస జ్వాలధూమసమాకణములు గ్రక్కుచుఁ ♦ గడుభయానకములయి రాముపైఁ ♦ గవిసెను వాసుకి సన్నిభస్ఫుర్గ్మముల్ ♦ జ్వలదనూన
భోగముల్ గురువిష♦పుంజఁబులను నగు నాభుజంగంబులు ♦ నఖిలదిశల
విదిశల వ్యాపించెఁ ♦ వే మీఁది కేతెంచు నమ్మహాభుజగస♦ర్పముల రాముఁ
తే. డట్టె కనుఁగొని యనిలోన ♦ నద్భుతంబు
గనఁబడన్ ఘోరసాధ్వస♦కరమహోగ్ర
భావమా గారుడాస్త్రంబు ♦ వైచె నద్ది
కనకపుంఖంబులై యగ్ని♦కాఁతు లలర ౨౧ 4506

క. నరపతి ధనువును విడుచుచు, నరిఁ బడి బహుశరము లగుచు ♦ నురుఫణిరిపులై
సురపథమున హాటకమయ,గరుడపతత్త్రులయి స్వేచ్ఛ♦గాఁ జరియించెన్ ౨౨

క. గరుడాకారంబులు కా,మరూపములు నైన నృపతి♦మంచిను శరముల్
గురుజవములొంచు సర్పా,త్కరములుగా నొప్పు దనుజ♦కాండవితతులన్. ౨౩

క త్వరలోనె రూపుమాపెను,, సురవైరవిభుండు తనదు ♦ సునిశితశర మ
వ్వసుసం బ్రతిహతమగుటం, బరికించుచుఁ గ్రుద్ధుఁడగుచు ♦ భయదశరతతిన్.

క. పెనువర్ష మట్లు కురిసెను,, ఘనకార్యం బేని చుల్కఁ♦గాఁ జేసెడు రా
ముని నంత శరసహస్రం,బున రాక్షసవిభుఁడు నొంచి ♦ పూనిక మెఱయన్.

క శరవితతి మాతలిని న,వ్వరుస న్నొప్పించె, మఱియు ♦ వాసవునిమహా
త్తరరథకేతనపటమును, సరిగా లక్షించి యొక్క♦సాయక మేసెన్ ౨౬

ఆ. ఇట్లు నాయకమ్ము ♦ వేసి దానిం జెండి, స్యందనమున కంగ♦మైన కేతు
దండవరమునుండి ♦ తపనీయమయ మగు, ధ్వజము రథము నడుమఁ♦బడఁగఁ జేసి

క శగజాలంబున నింద్రుని, తురగంబుల నొవ్వనేసె, ♦ దుర్గతియగు నా
సురవైరిమహాకార్యము, సురగంధర్వులును మఱియు ♦ శుభచారణులున్.

క. దానవులును గని ఖేదముఁ, బూనిరి మౌనీంద్రు లట్టె ♦ బుధనుతిగను నా
వానరవీరవిభీషణు, లానరపతి యార్తుఁడయ్యె ♦ నని గనిరి వ్యథన్ ౨౯

తే. రావణాహ్వయరాహుసం♦గ్రస్తుఁడైన
రామచంద్రుని గని బుధ♦గ్రహము లోక
బాధగల్గఁగఁ జేయంగ ♦ బ్రహ్మదేవ
తాకమై చంద్రుప్రియమునై ♦ లనసుదాని. ౩౦ 4515

క పరిమగు రోహిణి తారను, బరిమార్చుగ నాక్రమించి ♦ వగలక నిలిచెన్,
శరనిధియు ధూమసంయుతి,పరివృతమూర్మి మయి మండు♦భంగిఁ జెలఁగుచున్.

---

* విషేదు ర్దైవగంధర్వా దానవా శ్చారణై సహ.-అనిమూ.

౹క. ఖరకరుఁ గ్రుద్ధుండై తా, నరుదుగ వృశ్చికయించునట్టు ♦ లట్టె యెగిరె, భా
స్కరుఁడును మందకరుండై, పగుపతేరుం బొలుచు శస్త్ర♦వర్ణము రీతిన్. ౩౧౪
క. తనువలరఁ గబంధాంకం,బును ధూమకేతు♦వునఁ గూడి కనుం
గొనవయ్యెఁ, గోసలేశుఁ, కనుఁగు నక్షత్రమగుచు ♦ నసహ్యతనుగుచున్. ౩౨
తే. ఇంద్రుఁ డగ్ని దేవతలయి ♦ యొసఁగి యున్న
యావిశాఖను గుజుఁ డపు ♦ డాక్రమించి
యుండె, దశశీర్షములు తన♦కొప్ప వింశ
తిభుజములు పొంగ రాక్షసా♦ధిపతి యపుడు ౩౩౹ 4519
క. కరగతశరాసనుండై, యరుదుగ మైనాకశైల ♦ మట్లు కనఁబడెన్,
సురవైరి యేచి యిటునం,గ్గరమున నిరసించుచుండఁ♦గా రామునకున్. ౩౪౹
క ధనువున బాణంబులఁ గూ,ర్పను గూడ నశక్యుఁడయ్యె ♦ బలుభంగుల నా
దనుజేంద్రుఁడు నొప్పింపఁగ, మనుజేంద్రుఁడు కోప మూని♦యుండుచునంతన్.
ఆ. బొమలు ముడిచి కనుయు♦గముఁగయం దించుక
రక్తిమయుఁ జెలంగ ♦ రాముఁ డుగ్ర
దృష్టి వైరిఁ గాల్ప ♦ నెంచిన రీతిగ
గానఁబడుచుఁ గ్రోధ♦కలితుఁ డయ్యె. ౩౬ 4522

నూటమూఁడవ సర్గము సంపూర్ణము.

---

## ౧౦౮ - వ సర్గము.

రాముఁడు రావణుని యశ్వాదుల నొప్పించుట

క. మతిమంతుఁ డిట్లు రాముం, డతికోపము నొంది యుండ ♦ నాతనివదనం
బతిభీతిదముం గని భూ,తతతుల్ భయమొందె భూమి ♦ తాఁ గంపించెన్ ౧
క. తరువులు కదలన్ సింహో,త్కరములు శార్దూలవితతి ♦ తగ భీతిల భూ
ధర మది చలియించె నరి,ద్వరుఁడైన సముద్రుఁడట్టి ♦ భంగిఁ జలించెన్. ౨
చ పరుషనినాదముల్ గలుగు ♦ పక్షులు దారుణమేఘజాల మం
బరమునఁ గీడుగల్గుటకు ♦ వారనిచిహ్నములైన నాదముల్
పరుషముగా నొనర్చుచు స్వ♦భావముగాని గతిం జలించె, భూ
వరుఁ డిటు క్రుద్ధుఁ డౌటఁ బలు♦భంగులదారుణరీతిఁ జిహ్నముల్ ౩౹ 4525
తే. గలుగుచుండుటఁ గని భూత♦గణము భయము
నొందె, రావణుఁడును భీతిఁ ♦ బొందె నూరు
లైన యాయిరువ్వ రధికశిథ♦ముంకె రద్ర
హారణముల సంగరము చేయు ♦ నవసరమున ౪౹ 4526

---

[1] శస్త్రవర్ణ స్సపరుషో మందరశ్మి ర్దివాకరః - అనియూ.

క. లోకప్రళయకరంబగు, నాకలహము చేవవిశితు ♦ లాగంధర్వుల్
భీకరఫణులును గరుడులు, నాకోణపదైత్యులును మ♦హర్షులు కడఁకన్. ౫౪
తే వ్యోమయానంబులందుండి ♦ యొప్పఁ గాంచు
చుండి; రంత సురాసురుల్ ♦ చండసంగ
రమును దానిని జూచుచు ♦ రామరావ
ణులపయిం గల సమ్మోద♦ముల బలిమిని ౭ 4528
క. పరమం బగు భక్తిని ని,వ్వెరసం జెప్పుకొని, రందుఁ ♦ బరమముదమునన్
సురవైరులు దశవదనా!, దురమునను జయింపు మనిరి ♦ తోరపుమదులన్. ౮౪
క. అనియొన విజయముఁ జిక్కఁగఁ, గనుమని సురలెల్ల భూమి♦కాంతుఁ బలుక, దు
ర్మనమునఁ దగు రావణుఁ డా,యనిలో నానడుమఁ గ్రోధ♦మంది రఘువరున్
సీ. ప్రహరింపఁ గోరి గొ♦ప్పఁగఁదగు సాధన మేదని లోపల ♦ నెంచి వజ్ర
సారమై గురుతర♦శబ్దమై సకలారి నిర్మూలనచణమై ♦ నిర్భరగిరి
శృంగసన్నిభకూట♦చిత్రమై కనుఁగొన నతిభయంకరమయి ♦ యధికదారు
ణాగ్రమై ధూమయు♦క్తాగ్నినాఁ దగి మఱిప్రళయానలచయంబు♦పగిది నొప్పి
శివునిశూలమ్ము మిం♦చియు నేరికైనను జెంతకుఁ బోరాక ♦ యంతకునకు
ఆ. నైన దారసింప ♦ ననువుగాక సమస్త,భూతభయదమగుచుఁ ♦ బోలఁజొప్ప
నతికఁ జాలినదయి♦నెఱిఁదగుశూలంబుఁ,గొనియెఁ గాల్చునట్లు♦క్రుధను మిగిలి.
క పరమక్రుద్ధుండై యా,శరశూరులు చుట్టుఁ గొలువ ♦ సాధ్వసశూలం
బురు వీర్యంబున నడుమం, గరములఁ గైకొనియె, దీర్ఘ♦కాయుం డంతన్. ౧౩
క. అని నధిక్రోధంబునఁ, గను లరుణములగుచు నొప్పఁ♦గాఁ బెనుశూలం
బును నెత్తి స్వబలములు ముద,మును గనఁగా భీమనినద♦మును జేసెఁ గడున్
చ. దనుజమహేంద్రుభీమనిన♦దంబునకున్ దిశలున్ విదిక్కులు
ర్వి నభము వే వడంకె, నటు♦భీమరవుం డగుచున్ దురాత్ముఁడా
దనుజుని యారవంబునకు ♦ ధాత్రిని గల్గు సమస్తభూతముల్
గనియె భయంబు క్షోభమును ♦ గాంచెను వారిధి, యంతలోపలన్ ౧౬
క. ఘనవీర్యుఁ డలఘుశూలం,బును దాని గ్రహించి భయద♦ముగఁ బొల్చురవం
బును జేసి పరుషముగ రా,మునిగని యిట్లనియె, రోష♦మున నేరిచటన్. ౧౭
ఆ. వజ్రసారమగుచు ♦ వఱలు నీశూలంబు, నెత్తినాఁడ దీని ♦ నీక్షణంబ
యిద్ది నిన్ను నీదు♦ముద్దుతమ్ముని వధిం,పంగఁ జాలు రామ ♦ బవరమందు.
క ఘనుఁడను నేనని యెంచెదు, మను జేశా! నిన్ను నిపుడె ♦ మ్రందించి రణం
బున సేనాముఖమునఁ జ,చ్చిన శూరాసురులలోనఁ ♦ జేర్తు సమముగన్ ౧౮
క. ఓరఘురామా! యింటుక, యీరణమున నిల్వ నిన్ను ♦ నీశూలమునన్
నే రయమునఁ జంపుదు నని, యారావణుఁ డసురభర్త ♦ యతిభయదముగన్.

ఆ. పలికి రాముపైన ♦ బలిమిని వైచె నా,శూలమును; దగంగ ♦ శూల మదియు
దనుజకరవిముక్తి ♦ గనుచు విద్యుచ్ఛిఖా,సకృశశిఖలు చెలఁగ ♦ శబ్ద మొలయ.

క ఎనిమిదిగంటలు నిస్వన, మొనరుచు ముఖ్యంగ వెలిఁగె ♦ వ్యోమంబున, దా
నిని వీర్యవంతుఁడగు నా,జనపతి జ్వలియించుచుండఁ ♦ జక్కం గనియెన్. ౨౧౫

ఆ. ఘోరదర్శనమయి ♦ కొంకక వచ్చు నా,శూలవరము నట్టి ♦ చూచి పృథుల
ధనువు బలిమి లాగి ♦ దారుణాంబకముల, వైచెఁ, బ్రళయమందు ♦ భయదరీతి.

క. జ్వలియించెడు హుతవహునిన్, జలధారల వజ్రి నిలువు ♦ చందంబునఁ బై
కలరుచు వచ్చెడు శూలము, నలఘుతరాంబకము లేసి ♦ యాతఁడు నిలిపెన్.

చ. జనపతికార్ముకచ్యుతని ♦ శాతశరంబుల శూల మద్ది యా
యని మొన నగ్ని ప్రజ్వరిలి ♦ యార్భటిచే శలభంబులన్ హరిం
చునట్టులు బూదిచేసె, నృప ♦ శూరుఁడు రాముఁడు స్వీయబాణముల్
ఘనతరశూలముం దగిలి ♦ క్రన్నన చూర్ణములై నభంబునన్. ౨౪౫ 4543

తే. కాలిపోవుటఁ గన్గొని ♦ గాఢకోప, మందె, నంతట నారఘు ♦ నందనుండు
పరమకోపంబు నొందె యా ♦ పాకశాస,నాభినిర్మితమయిప్రభా ♦ వాఢ్య మగుచు.

క. మాతలి తనకై తెచ్చిన,దై తగు నాశక్తి నెత్తె, ♦ నలఘుబలుం డా
భూతలపతి యాశక్తిని, నాతతబల మలర నెత్తి ♦ యతిశయనియతిన్. ౨౬

క. గిరగిరఁ ద్రిప్పఁగ నయ్యది, నరఘంటాకల్పితార ♦ వంబయి లయమం
దురుభానుపోల్కవలె నం,బర మెల్ల వెలుంగ మిగుల ♦ బాసిలె నంతన్. ౨౭

ఉ. రామకరప్రయుక్తయయి ♦ రావణుశూలముఁ దాఁకె; శక్తి యు
ద్దామమహాయుధంబు తనుఁ ♦ దాఁకిన యాగురుశూల మప్పుడే
భూమిని గూలె బ్రస్తలయి ♦ భూరిరుచుల్ వడిఁ దగ్గిపోవ, నా
రాముఁడు తీవ్రవేగము ల ♦ రాతిభయంకరముల్ నిశాతముల్ ౨౮ 4547

తే అశనితుల్యములును నగు ♦ నట్టి బాణ
ములఁ బ్రయోగించి జవమున ♦ వెలయ దనుజు
నశ్వముల నొంచె, నంతట ♦ నతఁడు మఱియు
హస్తలాఘవమున నసు ♦ రారి యురము ౨౯ 4548

క శితశరగణమున నొంచెను, నతనిలలాటమున నాట ♦ నంబకములు మూఁ
డు తగన్ వైచెను రాక్షస,పతి సర్వాంగములయందు ♦ బాణము లోకటన్.

తే తగులఁగా రక్తధారల ♦ వడిసి పసిపి
తమయిపొల్చె నశోక ♦ మై మహా సిద్ధగుచ్ఛ
నని మొనం బొల్చె; నట్లు న ♦ రారి రామ
సాయకావిద్ధగాత్రుఁడై ♦ కాయ మెల్ల. ౩౧౫ 4550

తే. రక్తమునఁ జాలఁ దడియ సం♦గ్రామమందు
ఖేదమొందియు నంత మి♦క్కిలియుఁ గ్రోధ
మంది రాముని౯ జంపు ను♦ద్యమము తనరఁ
దనకుఁ గల్గినశక్తిఁ జూ♦పఁ గాఁ బూనెంచె ౩౨ 4551

నూటనాల్గవ సర్గము సంపూర్ణము

---

౧౦౫ వ - సర్గము

రాముఁడు రావణుని నిందించి నొప్పించుట రావణునిసారథి తేరుఁ దొలఁగించుట.

క. అని గర్వితుఁ డారావణుఁ, డనూనకోపమున రాముఁ♦డలఘుశరతతిం
దను నొప్పింపఁగఁ గోపం,బును బొందెం దాను, వీర్య♦మునఁ బొల్చుటచే౯

చ. దనుజవరుండు రోషమునఁ♦ దద్దయుఁ గన్నులు ప్రజ్వరిల్ల న
య్యనుపమసంగరంబున శ♦రాసనముం గడు లాగి బాణపం
క్తిని నిగుడించి నొంచె రఘు♦ధీరుని, నభ్రమునుండి మేఘ మొ
య్యన జలధారలం జెఱువు♦ నంతయు నిండఁగఁ జేయునట్లుగ౯. ౨ 4553

క. వరసాయకములు వేలుగఁ, బరఁగించి కృపాలుతనువు♦ బాణమయముగాఁ
గర ముద్ధతిఁ జేసెను, భూ,వరుఁ డటు తన్ముక్తబాణ♦వర్షముచేత౯ ౩ 4554

తే. పూరితుండయి నిశ్చల♦భూధ్రమట్లు
కంపమును బొందకుండెను ♦ ఘనపరాక్ర
ముఁడగు నారాముఁ డని నిల♦కడను బూని
బాణముల బాణముల నిల్పి ♦ పౌరుషమున ౪ 4555

క. దనుజేంద్రుని శరములఁ గయిఁ,కొనియెను రవికరములట్లు, ♦ క్రూరదనుజపుం
డును గ్రుద్ధిఁ గరలాఘవమును, గనఁబడఁగ మహోత్సుఁడైన ♦ క్ష్మావిభు నెదపై.

క. శితశరసహస్రములు వై,చి తగ౯ విక్రమము చూపె, ♦ క్షితిపతి రాముం
డు తనువు నెత్తుటఁ దడిసిన,*తమున నుత్ఫుల్లకింశు♦కద్రుమము వలె౯ ౬

క. కనఁబడియెను, ఘనతేజం,బునఁ దగు నారాముఁ డసుర♦పుంగవుశరపం
క్తిని గొట్టఁబడుచునాగ్రహ, మునలయకాలార్కచండ♦మునఁ గొనెఁ దూపుల్.

సీ. అంత నన్యోన్య ము♦త్సాగ్రహంబున మించు నారామరావణు♦లతులతీవ్ర
శరతతి శ్ఛన్నమా♦ సంగరంబున నందుఁ గనఁబడకుండి, ర♦క్కాలమందు
వీరుఁడౌ రఘుపతి ♦ నిపులకోపముఁ బొంది దన జేశుఁ గని నవ్వి ♦ దారుణోక్తు
లను బల్కె నిట్లని ♦ దనుజాధమా' నేను బరిసరంబున లేని♦తరుణమందు

తే. వివశయై యున్న నాభార్యఁ♦బృథ్వితనయ,నాజనస్థానముననుండి♦యపహరించి
తివి గదా? యిట్టి నీవెట్లు ♦ ధీరుఁడవగు, దిలను విక్రమ మనఁగ లే♦ దెన్నఁ నీకు,

క. ఘోరారణ్యంబున నేఁ, జేరువ లేనట్టి తఱిని ♦ జింత మునిఁగి నన్
గోరుచునుండెడు సీతను, గ్రూరా! బలవంతముగను ♦ గొని తెచ్చితి వే.

తే. ఇట్టి దుష్కార్య మొనరించి ♦ యిపుడు నీవు
శూరుఁడను నేననుచు నెన్ను ♦ చుం జరించు
చున్నవాఁడవుగద; పర ♦ యువతులందు
మనసుగల్గిన యోశూర! ♦ దనుజ! నీచ! ౧౨ 4561

క. పెనిమిటి సన్నిధి లేనపు, డనయముగా నట్టివనిత ♦ లం దపకృతి దు
ర్జనులవలెం జేసియు నీ,మనమున శూరుండ ననుచు ♦ మఱి తలఁచెదవే. ౧౩

తే. నీకు మర్యాద లేదు వి ♦ నీత లేదు
సిగ్గునున్ లేదు నడవడి ♦ చెంది యుండ
దొకవిధంబుగ గర్వంబు ♦ నొంది నీవె
మృత్యువును దెచ్చుకొని మీఁదు ♦ మిక్కిలి యిటు. ౧౪ 4563

సీ. శూరునిగాఁ దలం ♦ చుచుఁ జరియించెదు, శూరుఁడవగుదు కు ♦ బేరుతమ్ముఁ
డవు బలసంయుక్తుఁ ♦ డవు నీవు నాభార్య జనకజ దొంగిలి ♦ శ్లాఘనీయ
మును మహత్తరమును ♦ ననుపమకీర్తికంబునగు కార్యంబు ని ♦ ట్లొనరిచితివి;
గర్వంబునన్ లోక ♦ గర్హితంబును నహితంబునౌ కార్య ము ♦ త్తఱి నొనరిచి

తే. తివి గదా దానికే గొప్ప ♦ దిగఁ గనఁబడు
ఫలము నిప్పుడు పొందుమా, ♦ కలుషబుద్ధి
నిను మహాశూరుఁడనని యా ♦ త్మను దలంతు
గాదె నీవే మహత్తర ♦ కాననమున ౧౫ 4564

ఆ. అతివ దొంగవలెనె ♦ యపహరించెదు తఱి, నీకు సిగ్గు లేదె, ♦ నీవు నాదు
పరిసరమున నట్లు ♦ ధరణీతనూజను, బలిమి నపహరింపఁ ♦ దలఁచి యున్న.

క. అనుపమమత్సాయకముల, వినిహతుఁడవు నగుచు నపుడె ♦ వేడుక మీఱం
జనియుందు నీదు తమ్ముఁడు, ఘనఁబలుఁడగు ఖరునికడకుఁ, ♦ గాపురుషవరా!

క. విను మద్భాగ్యవశంబునఁ, గనఁబడితివి నాకు నెదుటఁ ♦ గాన నిపుడె నిన్
ఘనదారుణశరముల మృతిఁ, గనఁజేసి నరేతరాణ్ణ ♦ గరి కనిపెదఁ జూ!. ౧౯

క. దనుజా! కుండలముల నొప్పిన నీతల నాదు బాణ ♦ భిన్నంబయి మే
దిని నిందు దుమ్ములోఁ బడి, కొనిపోఁబడుఁగాక క్రోష్టు ♦ కూటాదులచేన్ ౨౦

చ. ధరణిని నీవు గూలఁగన ♦ దానికి వక్షముపైని గ్రద్ధగుం
పు రయము మీఱ వ్రాలి శర ♦ పూగకృతవ్రణనిర్గళన్మహా
త్తరరుధిరప్రవాహమును ♦ దప్పియడంగఁగ ద్రావుఁగాక; నా
శరములఁ జీల్పఁగాఁ బడుచు ♦ త్రాస్థలిఁ బ్రాణము లేగ వేగమే. ౨౧ 4569

ఆ. పడిన నిన్నుఁ గాంచి ♦ పటుతరజవమున, వచ్చి పక్షు లెల్ల ♦ వైనతేయ

పతును లహాలలనీడ్చు ♦ భంగి నీ ప్రేగుఁ గుఁ, బట్టి లాగుఁ గాక ♦ బలముకోలుదిఁ. ౨౨

చ. అనియిటు వైరినాశకరుఁ ♦ డారఘువీరుఁడు పల్కుచున్ దురా
త్మునిఁ దనచెంతనే పొలుచు ♦ మూర్ఖుని దీక్ష్ణశరాంబకాళి వై
చెను, దనవైరిఁ జంపుటకుఁ ♦ జిత్తమునందునఁ గోరుచున్న రా
మున కపుడస్త్రశక్తిబలు ♦ ముల్ క్రమశంబును వీర్య మాయనిక్. ౨౩ 4571

తే. ద్విగుణములుగను గన్పట్టె ♦ విదితచిత్తుఁ
డైన యారాఘవునకు ది ♦ వ్యాస్త్ర వితతు
లన్నియును ముందుఁ దోఁచెఁ; బ్ర ♦ హర్షమునను
భూరితేజుఁడు రఘుకుల ♦ పుంగవుండు ౨౪ 4572

క. ద్విగుణితకరలాఘవమునఁ, దగియెక్, దనుజాంతకుఁడగు ♦ ధాత్రీపతి యా
జగదభిరాముం డతఁ డి,ప్పగిదిని శుభచిహ్నములను ♦ బరికించి మదిక్ ౨౫

చ. దనుజవరేణ్యు నొంచెఁ గడు ♦ దర్పమునన్ మఱియున్, గపీంద్రు లే
సిన పెనుతాలచేత నృప ♦ శేఖరునాలుకన్నష్టి చేశ నొ
చ్చిన యలదానవేశ్వరుని ♦ చిత్తము ఘూర్ణిలఁ జొచ్చె నంత నా
తనికి లయంబు చెంతకును ♦ దారసిలంగను భ్రాంతి నొందుటన్ ౨౬ 1574

క. శరముల నడిపై వైవక, శరాసనము లాగకుండె, ♦ స్వాంత మనశమై
పరఁగుటఁ బ్రతిబాణము లే,సి రాముమీఁద్యము నషంగఁ ♦ జేయక యుండెన్

సీ. రావణుఁ డేయుశ ♦ రంబులు శస్త్రముల్ బహుభంగులం గానఁ ♦ బడుచు ననిని
చేదనసంభేద ♦ నాదికార్యంబుల నొనరింపఁగాఁ జా ♦ కుండె మృత్యు
వతనికిఁ జెంతనే ♦ యమరియుండుట, నంత దానవపతి యావ ♦ స్థ నిటు లొందు
టను గాంచి యతనిసవ్యం ♦ దనమునునడుపుసారథినుంత యేని సం ♦ భ్రాంతిఁ గనక

ఆ యుద్ధభూమినుండి ♦ యొకరీతి మెల్లఁగ, నారిథంబుఁ దొలఁగు ♦ నట్లు చేసె
నతని కింకమృత్యు ♦ వాసన్న మూనని, తనమనంబునందుఁ ♦ దలఁచెఁ గాన

నూటయైదవ సర్గము సంపూర్ణము

౧౦౬ - వ సర్గము.

రావణుండు సారథిం బెసప్పరించి వెనుక యుద్ధమునకు వచ్చి రాము మార్కొనుట

చ. దనుజవరుండు కాలుఁ డొకఁ ♦ డగు బుద్ధిపూర్వఁగ మోహ మొంది యుం
తని వచియింపరాని క్రుధ ♦ నందుట గన్నులు కెంపు రాఁ గనం
గొనఁ దగియుండ సారథిని ♦ గొబ్బునఁ గాంచి చించె, దుర్మతీ!
నను బలశక్తిహీనుగఁ గ ♦ నం బరిభ్రష్టతని న మానుష్యగక్ ౧౫ 4577

---

* శనై ర్యుద్ధా దసంభ్రాంతో రథం ప్ర స్యాపవాహ యత్ - అనిమూ ఆటవెలదియందలి మూడవనాల్గొపాదము 'అసంభ్రాంతః' అను పదస్వారస్యమును వెల్లడించుట కధికముగా జెప్పఁబడిన పని యెఱుంగవలయు

తే అల్పునట్లుగ భీరువు ♦ నట్లు దైన్యహీనునిగ గతతేజునిగా నొకింత
మాయ తెలియనివానిగ ♦ మహిఁ దలంచి నిన్నుఁ దలంచినీ ♦ వాంతకుండు.

క. మనమున నలక్ష్యమునఁగఁ జేసి నీవుఁ బోఁగినటు లీవు ♦ స్వేచ్ఛఁ దిరిగెదే,
నను నడిగి మదీయానుజ్ఞను గైకొనకే యలక్ష్య ♦ ముగఁ గన్గొనుచున్.

క. వైరిసమక్షంబున నా, యీరథముఁ దొలంగఁదోలి ♦ యేల యిచటికిం
జేరిచితి? వనార్యా! నా, భూరియశంబుఁ జరలబ్ధ ♦ మును వీర్యంబున్. ౪

క. ఘన తేజము రావణుఁడే, యని మొనఁ బరగెత్తకుండ ♦ నను నమ్మకమున్
బనిపూని యిపుడు నీచే,తను నాశముఁ బొందెఁ జుమ్ము ♦ తగ నవినీతిన్. ౫

ఆ [1]ఖ్యాతవీర్యుఁడైన ♦ యరిని గాంతఁ దిన్మత్ప
రాక్రమమునుఁ జూపి ♦ రంజిలనటు
జేయఁదగినవాఁడ ♦ నూఁ గొట్టి శత్రువు
గనుచునుండ యుద్ధ ♦ కాంక్షు నన్ను ౬ 4582

క ఒనరిచితివి కాపురుషుని,గను; దుర్బుద్ధీ మదీయ ♦ శత్రురథము దీ
నిని మోహంబునఁ దొలఁగించి,చినయది తలపోయ నీదు ♦ చిత్తమ్మారన్ ౭

క అరినీకు విత్త మొసఁగుచుఁ, బరవశునిగఁ జేసె ననుచు ♦ నాస్వాంతమ్మున ని
త్తరుణమునఁ దోఁచె సత్యమె, పరికింపఁగ నిద్ది యోరి ♦ పాపమనీషా!. ౮

చ హితమును గోరుమిత్రు లిటు ♦ లెప్పుడు సేయఁగఁ బూన రిద్ది శ
త్రుతతికిఁ జేయఁదగ్గ మగుఁ ♦ దోడనె చేసితి వంతెకాని యీ
వితముఁ జేయనౌనె యని ♦ వేగ చిత్తములోఁ దలంచి స
ద్గతినొనరింపవైతి, చిర ♦ కాలము నాకడ నున్నవాఁడవే ౯ 4585

క. నేనొనరించిన సత్కృతి, మానసమునఁ దోఁచునేని ♦ మాటాడక యా
భూనాథుఁడు పైఁబడఁగా, దానై రాకుండఁగను గ ♦ ధంబు జవమునన్. ౯

క. మరలింపు, మనుచు నీవిధిఁ, బరుషముగా బుద్ధిమాలి ♦ పల్కినతనివై
ఖరి విని హితమతి సారధి, సురశత్రువు నాజ్ఞ నడిపించు ♦ చున్ హితభణితిన్

తే. పలికె నిట్లని, నేభయంబునఁ గాని లేమ
యూహనుగాని నను దిప్పలే ♦ దెవుబడిచి
విత్తమొసఁగంగి లేదు ♦ మత్తి తినను
సంశయము లేదు నీదగు ♦ సత్కృతులను ౧౦ 4588

క మనమున నుంచుకొని వేదో, నుత్తాధిప స్నేహమును ని ♦ తాంతము గలవాఁ
డనె, నేనీహితము యశస్సును గోరుచు మత్రితి నాప ♦ నునఁ బూని తగన్

1 శత్రోః ప్రఖ్యాతవీర్యస్య. రంజనీయస్య విక్రమైః, పశ్యతో యుద్ధలుబ్ధోహం కృతః కాపురుష స్త్వయా-అనిమా

తే. నీకుహితమైన కార్యంబు ♦ నేను జేసి
నాఁడ నప్రియ మయ్యె నే♦న్న నడినీకు;
నో మహారాజ! యెదియే ♦ నొక్కకులము
నందు జనియించి కుమతియై ♦ యహితుఁ డగుచు ౧౭ 4590

సీ. ఉన్నవాఁడుంబోలె ♦ నొకరీతి నీహితమును గోరి రథము తె♦చ్చిన నను గని
కుమతి యీతండని ♦ శంకక తలఁచుట యుక్తంబుగాదు, మ♦హోన్నతోర్వి
నుండి తరంగిణి ♦ యురువేగమున మరలిన తెఱంగున రణం♦బున రథంబు
నుండనీయక యిట్లు ♦ చండవేగంబున నరదంబు తెచ్చిన♦యందులకును

ఆ. వినుము కారణంబు ♦ వివరింతు, వీరా! రణాగ్రమందు గొప్ప♦దగు తెగువను
బూని నీవు సమర♦మును జేసి యలయుట, తెలియవచ్చె నాకుఁ ♦ దెల్లముగను

క. నీనెమ్మోమున మోదము, నీనెమ్మదిఁ దెగునయున్న ♦ నియతియు నెఱుఁగం
గానైతి నీరథాశ్వము, లీ నీరధ మీఁడ్చి యీడ్చి♦యే దీనములై. ౧౮

తే. ఎండతగులుటచే సోలి ♦ యింతయేని
బలము లేకయె గొప్పదౌ ♦ వర్షమునకుఁ
జిక్కినట్టి యావులరీతిఁ ♦ జేష్ట లుడిగి
యుండె, నేయేనిమిత్తంబు ♦ లోని మనకు ౧౯ 4593

క కనఁబడుచుండెనో యవి యెల్లను బ్రతికూలముగ దుష్ఫ♦లములుగ నాకుం
గనఁబడియె, మఱియు సారథి,యనఁదగువాఁడెన్నఁదగుశు♦భాశుభములనున్.

సీ దేశకాలంబుల♦ తెఱఁగును ముఖమునఁ గల సంతసమ్మును ♦ గలఁక లోను
గాఁగల గుఱుతులఁ ♦ గడఁగి దైన్యము ఖేదహర్షంబులను దన♦యధిపునకును
గలబలాబలముల ♦ త్రొక్కస్థలి నిమ్నమో యున్నతంబో యని♦యును సమతల
విషమభాగంబుల ♦ విమతులకుం గల యట్టి ఛిద్రంబుల ♦ నరద మరికిఁ

తే. జెంతకో ప్రక్కగనో లేక ♦ స్థిరముగ నట
నునుచుటయొ వైరి కభిముఖ♦మునఁ జెలఁగుచు
వెనుక కేగుట యివియన్ని♦యును నెఱింగి
గడుపఁదగు స్యందనంబుఁ జ♦క్కనిగతి నని ౨౦ 4595

క వినుము వీరా! నీకున్ స్యం,దనతురగంబులకుఁ గొంత ♦ తడ వ్రాఱుట గ
ల్గు నిమిత్తము దుర్భరముగు, నసి స్టము గల్గకుండ ♦ నరసి మనమునన్ ౨౧

క. అరదముఁ దొలఁగించుట గా, తగుణంబున యుక్తమనుచుఁ♦ దలఁచి తొలఁగున
ట్లురవడిఁ గొని తెచ్చితి నే, నరయక స్వేచ్ఛగను దోలు ♦ నంత కుమతినే.

ఆ. ప్రభువ వీవు గానఁ♦ బటుతరస్నేహంబు, నూని చేసినాఁడఁ ♦ గాని వేఱు

* నాస్మి న్నర్థే మహారాజ త్వం మాం ప్రియహితే రతం, కశ్చి ల్లఘు రి వానార్యో దోష
తో గంతు మర్హసి-అనిమూ. కశ్చిత్ యత్ర కుత్రాపి కులే జాతః లఘుః అల్పబుద్ధిః-అనివ్యాఖ్య

గాదు, వీర శత్రు♦గణసూదనా' యుఘు, డాజ్ఞ చేయు మెట్టు♦లాజ్ఞ యిడిన.

క. నీసొమ్ము దిద్దయప్పను, నేసదిణిం దీర్పఁదగునో ♦ యెన్ని మదిని నేఁ
జేసెద నట్లే తగినటు, లిసమయముం దలంచి ♦ హితముగఁ జెపుమా. ౨౩

చ దనుజకులాముఁ డీవిధ హి♦తం బగు సారథి పల్కువాక్యముల్
విని పరిహృష్టుఁడై యతని ♦ వే పలుభంగుల సత్కరించి యు
ద్ధనిరతిఁ గొన్న చిత్తమునఁ ♦ దానిటుపల్కెను, సారథీ' రథం
బును వడిఁ దోలుమా యెచట ♦ భూపతియుండునో యాధరిత్రికిన్ ౨౪

క అని రావణుండు వైరి శ,మనుపురికిం బంపకుండ ♦ మరలుఁడు సుమ్మీ;
యని రాక్షసేంద్రుఁ డాతనిఁ, గని పలికి మహాముదమును ♦ గాంచినకతనన్

క వరనూతునకున్ హస్తా,భరణము శుభరీతి మిగుల ♦ భాసిలుదానిన్
గర మర్థి నొసఁగె, సారధి,యు రావణునివాక్య మట్టు ♦ లొప్పుగ రథమున్.

ఆ వైరి కభిముఖముగ ♦ వడిఁ దోలె, నారీతి
నధిపువాక్యచోది♦తాత్ముఁడగుచు
హయవరములఁ దోలె ♦ నావారథియు నంత
నమ్మహారథుఁడగు ♦ నసురవిభుఁడు ౨౭ 4603

క. మనమున సంతోషంబును, గననాస్యందనవరంబు ♦ క్షణమున యుద్ధం
బున రాముని కభిముఖమై, యనుపమముగ నిల్చె నమరు ♦ లచ్చెరు వందన్

నూటయాఱవ సర్గము సంపూర్ణము.

---

౧౦౭ - వ సర్గము.

ఆదిత్యహృదయమును రామున కగస్త్యుఁ డుపదేశించుట

చ. అనిఁ గనువేడ్క దేవనిక♦రాన్వితుఁడై చనుదెంచియున్న చ
క్కని మహిమంబు గల్గు ముని♦కాంతుఁ డగస్త్యుఁడు ఘోరసంగరం
బునఁ గడుశ్రాంతి నొందియును ♦ బూనిక యుద్ధము చేయువేడ్క వ
చ్చిన తనవైరి రావణుని ♦ జెచ్చెఱ ముందటఁ గాంచి యాత్మలోన్. ౧ 4605

తే ఈతని జయించు టెట్లొకో ♦ యిఁక తలఁచి నని
చింతలో మున్గియున్న యా♦క్షితిపతిఁ గని
యతని యొద్దకు వచ్చి యి♦ట్లనియె, దీర్ఘ
బాహుయుగళాంచితా' రామ♦భద్ర' రామ' ౨ 4606

క. ఏనుతిచేతన్ వైరుల, దానవులను గెల్వఁ గలవో ♦ దానిన్ గుహ్యం

* రామ రామ మహాబాహో-అనియూ

బై నెగడి సనాతనమై, మాసిన శంకానసుతిని ♦ మమత వచింతున్ 3 4607

తే. అర్ది యాదిత్యహృదయాహ్వ♦యంబు దాని
భక్తిం బఠియింపం బుణ్యము ♦ వైరినికర
నాశముంగల్గి జయము సం♦తతము గల్గు
నక్షయఫలంబు చేకూరు ♦ నధిక శుభము. ౪ 4608

తే. మంగళములకు నెల్లను ♦ మంగళంబు
సర్వపూర్వాఘములను నా♦శనము చేయు
నాధులను వ్యాధులను జెండు ♦ నమితమైన
యాయు వొసంగు జప్యంబు ♦ ననుపమంబు. ౫ 4609

క ¹పరమాంతరంగభక్తాం,తరమున వెలుంగొందువానిం ♦ దపనీయకరో
త్కరవిలసితుని నవోదయు,పరిభాసితు దేవమనుజ♦పరమోపాస్యున్ ౬

క. నిరతిశయదీప్తిమంతుని, సరసిజరిపుసూర్యముఖ్య♦సకలఖచరభా
సురదీప్తిదు బ్రహ్మాండో,త్కరపాలకు నీ స్తవమునం ♦ దమిం గొల్వు మికన్.

క. సురసంఘతనుండు సుమ్మీ, పరులను హీనులుగం జేయు ♦ పటుసామర్థ్యం
బు రహింగలాండు, గభస్తులు, నిరతము భావింపం జేయు ♦ నేర్పరి యితండే.

క. దేవాసురగణములం ద,త్పావనలోకములం దన ప్ర♦భాపటలముచే
భావించి రక్షణము సే,యేవేళ జేయుచుండు ♦ హితముగం జుమ్మీ. ౭

క. ఇతండే తలపోయంగాం, జతురాస్యకృతియు విష్ణు♦శంకరరూపుం
డితండె రిపుప్రజశోషణ, మతులితముగం జేయుంగాన♦నగు స్కందుండున్. ౭౫

²తే మఱి ప్రజాపతిరూపుండు ♦ మహితవిభవ
మునం జెలంగుచు మహేంద్రుండు ♦ ధనదుం డశ్లై
లయకరుండు గానం గాలుండౌ♦ను యముండగును
శిక్ష చేయుటచేతనే ♦ క్షితిప! వినుము. ౮ 4615

క. అమృతముం బుట్టించుటచే,త మహిన్ సోమాఖ్యనెగడుం ♦ దగ జలపతినా
నమునందాల్చుంబితరులునగు ,సుమహితులగువసువులితండె♦చూడంగ రామా!

తే. సాధ్యులశ్వులును మరుత్ప్ర♦వంబు మనువు
భూచరుండగు వాయువు ♦ పోలుచు వహ్ని
యును బ్రజాప్రాణవాయువు ♦ గనుము ఋతుని
కరమునకుం గర్త యగుప్రభా♦కరుండు నగును. ౯ 4617

1 ఇచటనుండి మహేశ్వరతీర్థులవారియభిప్రాయ మీపద్యములలో నిమిడియుండునని గ్రహింపవలయును. 2 ఇటం బ్రతిశబ్దమునకు వ్యుత్పత్త్యర్థములు తీర్థులవారి యభిప్రాయానుసారము వ్రాయంబడినవి.

సీసమాలిక —

అదితికి సుతుఁడుగ ♦ నవతరించినయట్టి యాదిత్యుఁడవు, జగ♦దాదికర్త
వగుదువు, కర్మము ♦ లాచరింపఁగ జనులను బురికొల్పుచు ♦ ననుపమానుఁ
డవగుసూర్యుఁడవు, లో♦కావళి కుపకారమాచరింపఁగ నంబ♦రాంగణమునఁ
జరియించుఖగుఁడవు, ♦ జగమును సృష్టిచేఁబోషింపు చున్నట్టి ♦ పూషుఁడవు,గ
భస్తిమంతుండవు ♦ భర్మము యాకృతివఱలుటచేత సు♦ర్ణసదృశుఁ
డవు, ప్రకాశించువాఁ♦డవు భానుమూర్తివి,బ్రహ్మాండసృష్టిని ♦ భాసిలుట హి
రణ్యరేతసుఁడవు, ♦ రహిమీఱఁగా దివాకరుఁడవు, ఘనసుకు ♦ గడుహరించు
నట్టియశ్వంబున ♦ నలుగుట హరిదశ్వుఁడనఁబడు వాఁడవు, ♦ హరిసకల
కళ్యాణగుణుఁడవై ♦ క్రాలుటచే సహస్రార్చివి, సప్తాహ్వ♦యాశ్వయుతుఁడ
వగుటచే లోకంబు♦నందు విఖ్యాతుఁడవగున స్తసప్తివి ♦ తగ సమస్త
శత్రుసంహారణమును ♦ సత్వరముగఁ జేయుచక్రము గల్గుట ♦ జగమునందుఁ
దొడరి మరీచిమం♦తుఁడవు, జ్ఞానోత్పత్తికిని బంధకంబగు ♦ జను సఘంబు
నపనయించుటచేత ♦ నననిని దిమిరోన్మథనుఁడను నామంబు ♦ దనగువాఁడ
వగుదువు, సుఖముల ♦ నంపఱకుం గల్గునట్లుచేయుట శంభుఁ♦డనఁగఁ బడుదు,
వవనీధవులతోడ ♦ నవనిని ముయ్యేడుసూఱులు కోలఁదిగ ♦ మహితశక్తి
నొనరించుటను త్వష్ట ♦ యనఁబడుదువు,మృతమైన బ్రహ్మాండంబు♦ననుపమగతి
జీవింపఁజేయుట♦చేత మార్తాండుఁడ, వంతట వ్యాపించు ♦ నట్టియంశు
మంతుఁడ వగుదువు ♦ మఱి జగదుత్పాదకసమష్టిజీవని♦కరము గర్భ
మందుఁ గల్గుటచేత ♦ నలగుహిరణ్యగర్భాఖ్యుండ వగుదు, వీ♦ఖిలతాప
తప్తులవిశ్రమ♦స్థానమగుటను శిశిరాహ్వయుండవు, తన♦యాశ్రితులకుఁ
బగవారలెవ్వరో ♦ వారికిఁ దాపంబుగల్గుగఁ జేయుటచేత ♦ నిలఁ దపనుఁడ
వగుదువు, తేజస్సు♦లఁ గలుగఁజేయుట భాస్కరుఁడవు, వేద♦వారములను
నుపదేశ మొసఁగుచు ♦ నుంటచే రవివగుదువు, రుద్రులిం గను♦ట వసుమతిని
నగ్నిగర్భుండవ ♦ నలరారుచుందు, వీ వదితిపుత్రుఁడవు, వ్యా♦వంతరాళ
మందు సుఖంబు గ♦న్నట్టికారణమున శంఖుఁడ వగుదువు, ♦ సాంద్రతుహిన
మును, సూర్యరూపంబుఁ ♦ గొని రూపుమాపుటశిశిరనాశనుఁడవనఁ♦జెలఁగు దీవు
తామసాహంకార♦తమువున నంబరము సృజింపుట నీవు ♦ గనుదు వ్యోమ
నాథాహ్వయము, తమో♦నాయకగుణభే♦దభావేదంబుల ♦ దంభమును గ
నినకారణమ్ముచే♦తను బుగ్యజుస్సాంపారగుఁడని పి♦ల్వఁబడుదు వీవు,
కర్మఫలాత్మక♦ఘనవృష్టిగలవాఁడ వగుటను ఘనవృష్టి ♦ యనఁబడుదువు
జలరాశియందున ♦ శయనించుటను నపాంమిత్రుఁడనంగను ♦ మెలఁగుదీవు,
వింధ్యమురీతిని ♦ వెలసి దుర్గమమగునట్టిసుషుమ్నాఖ్య ♦ మైనమార్గ

మందు శీఘ్రమ్ముగఁ ♦ బొందించుటను వింధ్యవీథిప్లవంగమ♦విమలనామ
ధారివి, లోకవి♦తతిని నిర్మించుసంకల్పము నాత్మను ♦ గల్గియుంట
నాతపి వగుదువు, ♦ హారిమండలి వీవు మృత్యువవగుదువు, ♦ మేళనమున
బింగళుండవు నీవు ♦ వెలయుచుందువు,సర్వాండములఁ గూడ ♦సంహరించు
టను సర్వతాపనుం ♦ డనఁబడు చుందువు, కవివి, విశ్వుండవు, ♦ సువిమలమగు
నట్టి తేజంబున ♦ నలరుటచే మహాతేజుఁ డనంబడు ♦ దీజగమున,
రంజకుఁడవు గాన ♦ రక్తుండ వగుదు, సర్వభవోద్భవుండవు, ♦ రమ్యసకల
తారకానక్షత్ర♦తతికిని గ్రహములకధినాథుఁడవు, వాని♦యంతరమున

తే. వఱలుచుండుదు, సకలవి♦శ్వముల కీవె
హేతువగుదువు? తేజస్సు ♦ లెల్ల నీదు
తేజమున డిందుపడుటను ♦ దివ్యమహిత
తేజమున నొప్పువాఁడవు ♦ దేవదేవ! ౧౭ 4618

క. ద్వాదశమండలవర్తి, నీదయ గల్గినను జాల ♦ నెమ్మిఁ గరుణాకుం
బ్రోదివగు నీకువందన, మో దేవా! యగునుగాక, ♦ యుద్యమ మలరన్ ౧౮

సీ. పూర్వపశ్చిమదిక్స♦భూధరాంతర్యామివైనవానికి మ్రొక్కు ♦ మానితవిల
సజ్జ్యోతిరాకార♦సహితులౌ ముక్తుల కధిపతివైయు, దివ♦సాధినాథుఁ
డగు భాస్కరేశున ♦ కంజలి, జయునకు జయభద్రునకు నమ♦స్కారమల్లె
హార్యశ్వునకు సహ♦స్రాంశునకుఁ బలుసారులు వందన♦సముదయములు

తే. వందనంబు లాదిత్యున♦కుం దమి మఱి
యుగ్రునకు వీరునకు మ్రొక్కు ♦ లొక్కరీతి
నంజలు లొగి సారంగున ♦ కమలకమల
సంప్రబోధునకున్ నమ♦స్కారశతము ౧౯ 4620

క. సవితతి మార్తాండునకున్, శతధృతిహారవిష్ణుపతికి ♦ సతతమ్ము నమ
స్తుతులగు సూర్యునకంజలి, స్తుతియగు నాదిత్యవర్చ♦సునకున్ భక్తిన్ ౨౦

సీ. భాస్వంతునకు సర్వ♦భక్షునకున్ మ్రొక్కు రౌద్రవపువునకు ♦ రమణ వినతి
తమము నడంచు ను♦త్తమునకు జేజేలు మఱి హిమఘ్నునకు న♦మస్సులగును
శత్రుఘ్నునకు నమ♦స్కారంబు లమితాత్మునకు జోతలు కృతఘ్న♦నాశనునకు
నంజలి దేవున ♦ కాదృతి మ్రొక్కులు జ్యోతిషాంపతికిని ♦ జోతలగును

తే. తప్తచామీకరాభుఁడై ♦ తనరురవికి
వహ్నికిన్ విశ్వకర్మకు ♦ వందనమ్ము
లగుఁ దమోభినిఘ్నునకు లో♦కాళిసాక్షి .
కిని రుచికి మ్రొక్కులగు మహా♦త్మునకు నతము ౨౧ 4622

క. ఇతఁడే ప్రళయంబున లోకతతిన్ నాశనముచేయుఁ ♦ గడఁగి మరల ని
ర్మితిచేయు దానినే సన్నుతిఁ బోషించును లయంబు ♦ మానిన తఱిన్. ౨౧౹

తే. కాంతి శోషిల్లఁజేయును ♦ గాయు నెండ
వాన గురియును, బ్రాణులు ♦ వరుస సుప్తి
నొందఁగా నంతరాత్మయై ♦ యొక్కరీతి
మేలుకొనియుండు నీతఁడే ♦ గ్రాలుశక్తి. ౨౨౹ 4624

సీ. అగ్నిహోత్రమితండె, ♦ యగ్నిహోత్రుల ఫలమునునీతఁడే వేద♦ములును మఖము
లును యజ్ఞముల ఫలం♦బును నీతఁడే లోకములఁగల్గు సత్కర్మ♦ములకు నెల్లఁ
బ్రభువగునీశఁ డీ♦రవియే నియంతయౌ; నోరాఘవా! విను ♦ మొక్కమాట
నెవ్వఁడైనను సరే ♦ యెట్టియాపదలను గష్టంబులందును ♦ గాననముల

తే. నిరతభయముల నీస్తుతి ♦ నియతిని బరి
యించినన్ గ్రిందుపడకుండు, ♦ నెల్లసుఖము
లబ్బు, నీవును జిత్తంబు ♦ నమలరీతి
నిశ్చలంబుగఁ జేసి యీ♦నిఖిలవిభుని ౨౪౹ 4625

తే. దేవదేవునిఁ బూజింపు ♦ దీనిచేత,
దీనినే మూఁడుసారులు ♦ పూనిక జపి
యించినన్ విజయంబును ♦ గాంచువాఁడ
వని, మహాబాహువిలసితా! ♦ యార్తిహరణ!. ౨౬ 4626

క. ఈతరుణంబున నీ వీవైతేయుని రావణాఖ్యుఁ ♦ దప్పక యనిలోఁ
జేతము రంజిలఁ జంపుదు, భూతలనాథా! యటంచు ♦ మునిపతి యెలమిన్.

క. పలికి యగస్త్యుఁడు వచ్చిన,టులెఁ జనియెన్, రఘుపతీంద్రుఁ♦డున్ గురుతేజం
బలఘుబలంబును మెఱయఁగ, నిలాసురోక్తమును నుతిని ♦ నెలమి వినంగన్.

క. తనశోకము నశియించుట,యును మిక్కిలి హృష్టుఁడగుచు♦నొప్పుమెఱయఁ జ
క్కనిమనసున వార్చి శుచిం, గని యాదిత్యుఁ బరుఁ జూచి♦కడుభక్తిమెయిన్.

తే. దీని జపియించి హర్షంబు ♦ మానసమునఁ
బొంది వీర్యము పొంగఁగ ♦ భూరిధనువుఁ
దాల్చి నిల్చెను, రాముఁ డం♦తఁ గలహమున
వైరి యగురావణునిఁ గాంచి ♦ బలము మెఱయ ౨౯౹ 4630

చ. మనమున హర్షమొంది యను♦మానము మాని సమస్తరీతులన్
దనుజవరేణ్యుఁ జంపుటకుఁ ♦ దా నచలస్థితి నిశ్చయించి వే
యని నొనరింపఁ బూనుకొనె, ♦ నంతట భానుఁడు తన్ను సన్నుతిం
దనిపెడు రాముఁ గాంచి ప్రమ♦దంబున మేను గగుర్పడంగ నా
దనుజుని చావు నాతనికి ♦ దా నవు డానతి యిచ్చి యంతటన్. ౩౦౹ 4631

తే. [1]తనదుమండలమును వీడి ♦ తగ నమర్త్య
సముదయాంతరమున నిల్చి ♦ సత్వరపడు
మింక రావణుఁ జంపంగ ♦ నినకులేశ !
యనుచు రామునకుం జెప్పె, ♦ నంత నచట. ౩౧ 4632

నూటయేడవ సర్గము సంపూర్ణము.

౧౦౮ - వ సర్గము.

-రావణునకు దుర్నిమిత్తములు తోచుట-

ఉ. సారథి సంతసిల్లి దను♦జప్రభునానతిరీతి నారథం
బారఘురాముసైన్యముఁ ♦ గాతురతం గలిగించునట్టిదై
భూరిసముచ్ఛ్రితధ్వజస♦మూహముగా నలరారి యుండఁగాఁ
జారుగతుల్దగన్ నడిపె ♦ సత్వర మారఘురాముమీఁదికిన్. ౧ 4633

క. అరదం బది చిత్రాలం,కరణయుతం బౌచు నొప్పి ♦ గంధర్వమహా
పురమున వెలయుచు హాటక,వరమాలిక లొప్ప వేగ♦వర్ధయుతమై. ౧౺

క. కలహోచితపరికరవిత,తులనుండి పతాక లలరఁ ♦ దోరపుధ్వజముల్
వెలయఁగఁ దనయున్నతి ని,మ్ముల నభ్రము ద్రింగ నెంచుఁ♦బో యనునటులై.

క. ధరణిన్ మ్రోయించుచు నా, పరసేనలఁ జెంపఁ జాలి ♦ భాసిలి స్వబలో
త్కరముల కుల్లాసమ్మును, బరఁగంగాఁ జేయుచును న♦భంగురమగుచున్. ౩౺

క నిరుపమగతి నొప్పెను భూ,నరుఁడగు శ్రీరాముఁ డసుర♦నల్లభురథ మా
కరణిన్ శబ్దించుచు భీ,కరరవమున దిక్కులొప్పు♦గతిఁ జేయునదై ౪ 4637

క తనపైకి వచ్చుచుండఁగఁ, గనియోన్, మఱియున్ నృపాల♦కాంతుఁడు రిపువా
దనుజేంద్రు నమ్మహారథ,మును [2]కృష్ణతురంగయుక్త♦మును నుగ్రంబున్. ౫

తే. భయదవర్చస్సుతోఁ గూడి ♦ పడగ లెల్ల
మెఱపుఁ దీఁగల రీతిగా ♦ మెఱయుచుండ
నింద్రునాయుధమట్టుల ♦ నెసఁగు ధనువు
గనఁబడన్ మేఘసంతతి ♦ గడురవముల ౫౺ 4639

క. ఘనవృష్టి గురియుచాడ్పున, సునిశితశరవృష్టి గురియు♦చుం దనపైకిం
జనుదేరఁ గాంచి తనదగు, ధనువున్ [3]బాలాబ్జురీతిఁ ♦ దగ వంచి క్రుధన్

క. కులిశము తాఁకునఁ బర్వత,ములు బగిలెడునపుడు గలుగు ♦ భూరిరవము న
ట్టులు చప్పుడు గలుగఁగ నుజ్జ్వలగుణమునుదీటుచున్ స్వ♦శౌర్యముపొంగన్.

---

1 సురగణమధ్యగతో వచ స్త్వరేతి-అనిమూ 2 కృష్ణవాజిసమాయుక్తమ్-అనిమూ 3 బాల చంద్రనతం ధనుః-అనిమూ.

తే. నిర్జరేంద్రుని సారథి♦ని గని పల్కె
మాతలీ! శత్రురథ మదె♦ యాశతగతి
వచ్చుచున్నది చూడుమా, ♦ వాసవరిపు
వతఁడు మరల మహాజవ♦ మూరు మంప. ౮౹ 4642

తే. అప్రదక్షిణ మగునట్లు♦ లరుగు దెంచు
చున్నవాఁడొట వానికి♦ యుద్ధమందు
మందు మతిగల్గినట్లున్న♦ దట్టులగుట
సరసగతి మీఱ నీవు హె♦చ్చరికఁ బూని. ౯౹ 4643

క. మనరథము వైరియరథం,బున కభిముఖముగను దోలు♦ము మరుత్తు నభం
బున లేచిన ధారాధర,మును జెండెడురీతిఁ జంపఁ♦ బూనితి వీనిన్. ౧౦౹

తే. దైన్య మొందక భ్రాంతినొం♦దక మనంబు
కలఁక నొందక నీవు వీ♦క్షణము లించు
కంతయేనియుఁ జెదరక♦ యలరఁ బగ్గ
ములఁ గ్రమంబునఁ ద్రిప్పుచు♦ లలితరథము. ౧౧ 4645

క. త్వరితంబుగఁ దోలుము, వ,జ్రిరథంబును నడపి ఖ్యాతిఁ♦ జెందిన యలనీ
కురుముదమున నీవిషయము, మరలం గఱపంగఁ దగదు♦ మాటవరుసతోన్.

క. అని సేయఁ బూనినాఁడను, గనుకన్ స్మరియింప నెంతుఁ♦గానీ బోధిం
పను బూనలేదు నేర్పం,గను దలఁపఁగ లే దటన్న, ♦ క్ష్మాపతిపలుకుల్. ౧౨౹

క. విని సారథితిలకుం డనఁ, జను నింద్రునిసారథియును♦ సంతసము మతిం
తను గని దోలెను నారథ,మును మాతలి యంత శక్తిఁ♦ బొంగుచునుండన్.

తే. రావణాసురునమ్మహా♦రథము నప్ర,దక్షిణమ్ముగఁ జేయుచుఁ♦ దనరథంబు
సవ్యగతిఁ దోలఁ దచ్చక్ర♦జనితరేణు, వడ్డముగఁ బర్వె రథికుల♦యంతరమున.

క. దనుజేంద్రుఁ డంతఁ గ్రోధం,బునఁ గన్నులు రక్తవర్ణ♦ములు గాఁగ రథం
బున కభిముఖుఁడై నిల్చిన, జనపతి నొప్పించెఁ దీవ్ర♦సాయకపంక్తిన్. ౧౩౹

సీ. మహితతేజుండగు♦ క్ష్మాపతి యంతట వైరిధర్షితుఁడయి♦ భూరిరోష
మున ధైర్య మొప్పంగ♦ మును మాతలి తెచ్చినట్టి మహావేగ♦మగుశతక్ర
తునిశరాసనవర్య♦మును రవిరశ్ములవంటి ప్రభల్ గల్గు♦ వాఁడి బాణ
మును గ్రహించెను,♦ కలహంబు చేయంగ నొండొంటి కెదురయి♦ యొకటినొకటిఁ

ఆ. జంపఁ గోరి బలసి♦ పెంపున నున్నట్టి, గజరిపులకు వలెనె♦ కర్బురేంద్ర
మనుజనాయకులకు♦ ననుపమోద్ధతంబు, చెల్లె నంత దేవ♦సిద్ధవరులు. ౧౪

క. మునిపతులును గంధర్వులు, దనుజేంద్రునిమరణ మెదలఁ♦ దమిఁ గోరుచు నుం
డినవార లొట యుద్ధం,బును దానిం జూచె నభ్ర♦మును జేరుటయున్. ౧౫

తే. గగురుఁ బుట్టించుచున్ భయం♦కరము లగుచు
రావణునినాశనంబును ♦ రామజయముఁ
గానఁ బఱచునుత్పాతముల్ ♦ గనఁబడియెను,
దనుజనాయకురథముపై♦నను రణమున. ౨౦ 4653

క. కురిసెను పర్జన్యుఁడు నె,త్తురుఁ దీక్ష్ణశ్వసనవితతి ♦ తోరపువడితో
వరుస నపసవ్యగతితోఁ, జరియించెను గృధ్రము లొగి♦సముదయములుగాన్.

క. తిరుగుచు నభమున రావణు,నరదం బేదెసలఁ బోవు ♦ నాదిక్కులకే
వరుసన్ వెంటను బోయెను,, సరిగా దివసమునఁ గూడ ♦ సాంద్రముగాఁగన్.

తే. లంక దాసానిపూవట్టు♦లన్ సురక్త,మైన సంధ్యాప్రకాశము ♦ ట్లావరింప
నాపురంబున్న ధరణి త్రి♦యామయందు, మండుచున్నట్లు కనఁబడెఁ♦జండరీతి.

క. పిడుగులతోడ నుహోల్కలు, పడియె మహారవము మిగులఁ♦బ్రతికూలములై
పడునవి రావణునకు నె,క్కుడు ఖేదము గల్గఁజేసి ♦ కుందఁగఁ జేసెన్. ౨౪

క. దనుజేంద్రుఁ డున్నచోటం, గనఁబడు మేదిని చలించెఁ ♦ గ్రవ్యాదులు వై
రినికాయముఁ బ్రహరింపం,గను బూనఁగ వారిభూరి♦కరము లొరులచేన్.

క. పట్టుకొనఁబడినయటు గ,న్పట్టెన్, రవికాంతు లెల్లఁ ♦ బచ్చవిగా న
ప్పట్టున నెఱ్ఱఁగఁ దెల్లఁగ, నట్టులె నల్లఁగను దనుజు♦సంగమునందున్. ౨౬

తే. ఒక్కరీతిగ వ్యాపించి ♦ యురుగిరిపయి
ధాతువులరీతిఁ జూపట్టె, ♦ నాతఱి నట
గ్రద్దలున్ వెంట రా వంచ♦కములు నోళ్ల
నగ్నికణములఁ గ్రక్కుచు ♦ నసురపతిని. ౨౭ 4660

చ. కనుఁగొనుచున్ శుభేతరము ♦ గల్గుటఁ దెల్పుచు నార్చె, వాయు వా
యనిమొన లేచి రావణున ♦ కక్షులు గన్పడకుండ ధూళిఁ జ
క్కనిగతిఁ జల్లుచున్ జవముఁ ♦ గైకొనుచుం బ్రతికూలరీతి వీ
చెను, జలదంబు తద్ధ్వనియుఁ ♦ జేకురకుండఁగఁ దద్బలంబులన్. ౨౮ 4661

ఆ. ఓర్వనలవిగాక ♦ యుగ్రంబులును నయి, భయదరవము లొప్పఁ ♦ బడియెనచట
నొక్కరీతిగాఁగ ♦ నుల్కాశనులు, దిగ్వి,దిక్కులందుఁ దమము♦ తెఱపిలేక.

క. చీఁకటులు గ్రమ్మె, ధూళియు, నాకరణిం గురియుచుంట ♦ నవకాశం బే
యాకసము నంకఁ జూపఁగ, నేకరణిం గల్గదయ్యె ♦ నెవ్వరి కైనన్. ౩౦

*చ. అనిమొన నందు శారికలు ♦ నార్భటిమీఱ రణంబు చేయుచున్
ఘనభయముం బొసంగునటు ♦ గాఢముగా నినదం బొనర్చుచున్

---

* కుర్వంత్యః కలహం ఘోరం శారికా స్త్వద్రథం ప్రతి, నిపేతు శ్శతశ స్తత్ర దారుణం దారుణా రుతాః-అనిమూ.

దనుజమహేంద్రుస్యందనవ♦తంసముపై శతసంఖ్యలొక్కరీ
తిని బడియెన్, మహాసురని♦శేసకుం గల ఘోటకావళుల్ ౩౦ 4664

తే. జఘనములనుండి పాతవహ్ని♦జ్వాలలను న
యనము లందుండి యశ్రుపు♦లను సమముగ
నగ్ని నుదకంబు సంతత ♦ మపుడు విడిచె,
నచట నిటు దారుణములు భ♦యావహములు. ౩౨ 4665

క కనదుష్టములునునై తగు, ననేకదుశ్శకునము లొగి ♦ నాతనికిం జా
వును దెల్పుచుఁ గనఁబడియెన్,, మనుజేంద్రునకును సమస్త♦మంగళదములై.

తే. జయము దెల్పెడు నట్టివై ♦ చాలసౌమ్య
ములును నయి యొప్పుశకునరా♦సులు గనఁబడె
నెల్లతావుల, జయమున ♦ నుల్లసిల్లఁ
జేయుశుభశకునముల నా♦క్షితిపతి గని ౩౪ 4667

క పరమప్రమదముఁ గనుచున్, సురారి మృతినొందినట్లై ♦ శుభము తనకు న
త్తరుణముననఁ గల్గినట్టులె, పరికించెను, నంత రామ♦భద్రుం డచటన్. ౩౫

తే. లక్షణజ్ఞుఁడు కావున ♦ నక్షయముగఁ
దనకు విజయంబు గల్గుట ♦ తగఁ దెలిపెడు
శుభనిమిత్తములం గని ♦ చొక్కపుఁదమిఁ
బులకితశరీరుఁడై వైరిఁ ♦ గలహమందు. ౩౫ 4669

క. పరిమార్పు మిగుల విక్రమ, మరుదుగఁ గనఁబఱుపఁ బూని♦యధికసుఖము నా
తరుణంబునఁ గని యింకం,బరుఁ డీల్గు నటంచుఁ దలఁచె ♦ నాస్వాంతమునందున్

నూటయెనిమిదవ సర్గము సంపూర్ణము

---

౧౦౯ - వ సర్గము.

రామ రావణులు మహాహవ మొనరించుట

చ. అరదము లెక్కియున్న దను♦జాధిపరాముల కప్డు భూరిసం
గరము భయంకరం బయి జ♦గత్తతి కెంతయు నోర్వరానిదై
పరుషమునై చెలంగె, సుర♦బాధకుఁడై తగు రాక్షసేంద్రుభీ
కరబలముల్ గపీంద్రుభట♦కాంశము సంగరనాథనాళిచేన్ ౧౫ 4671

తే. ఒప్పియుండియు వారల♦యుద్ధగర్వి
నమునఁ గల్గెడు వేడుకఁ ♦ దమ ప్రయత్న
ములను విడనాడి యారక ♦ నిలిచి, రంత
రామరావణు లతిఘోర♦రణము చేయ ౨ 4672

* తుల్యమగ్నిం చ వారి చ-అనిమా

క. ఆయతులై యుండఁగని, యాయిరువాఁగులఁ జెలంగ ♦ నందఱు సుభటుల్
పాయక యాయనిఁ గను తమి,నాయతనుతు లొంచు విస్మ ♦ యము గని రంతన్.

సీ. ఆవీరభటులు పె ♦ క్కాయుధంబులఁ గరంబులఁ దాల్చి యనిచేయ ♦ వలయుననుచు
నుండియు నాశ్చర్య ♦ మొంది యాయుద్ధంబుఁ గని పరస్పరము సం ♦ గరము చేయఁ
బూనకుండిరి, మఱి ♦ దానవసేనలు తనువిభుం గపిగణ ♦ ములు జూ బల
ములు రాముఁ గనుచు ని ♦ మ్ములవిస్మితాత్ములై చిత్రప్రతిమ లట్లు ♦ క్షితి నిలిచిరి,

*తే. రామరావణు లిద్దఱు ♦ నామహాహ
వమునఁ దోఁచు నిమిత్తము ♦ లమరఁ గాంచి
జయము నపజయమును గల్గు ♦ నరగ ననుచు
బుద్ధి నెంచియుఁ గోపంబు ♦ పొంగుచుండ ౭౪ 4674

క. భీతిరహితులై పోరిరి,, భూతలపతి జయము గల్గఁ ♦ బోయనియు, సురా
రాతివిభుండును మృతితన, కాతఱిని గల్గుననియు ♦ నాత్మఁ దలఁచుచున్.

తే. ధైర్య మూని విక్రమముల ♦ దారుణముగఁ
జూపి, రంతట వీర్యంబు ♦ శోభిలంగ
నసురపతిచాపమున నాయ ♦ కాలిఁ గూర్చి
దాశరథిస్యందనోల్లస ♦ ద్ధ్వజముమీఁద. ౭౬ 4676

క. త్వరపడి వైచెను, సయ్యవి, పురుహూతరథైకశక్తిఁ ♦ బొలుపఱి పడియెన్
ధరణిన్ ధ్వజము స్పృశింపకె,, ధరణీశుఁడు వీర్యమున ను ♦ దాత్తక్రుధచేన్.

చ. ధనువును లాగి రావణుని ♦ సత్కృతికిం బ్రతిచేయ నెంచె న
మ్మనమున, భూరిజిహ్మగము ♦ మాడ్కి సహింపక రాక స్వీయకాం
తిని జ్వలియించుచున్ మెఱయు ♦ తీవ్రశరంబును వైచె వైరికే
తనముపయిన్, శరం బదియుఁ ♦ దద్ధ్వజమున్ వడిఁ గూల్చి భూమిలోన్ ౧౧

తే. చొచ్చె, ధ్వజ మట్లు భిన్నమై ♦ క్షోణిఁ బడియె
గురుబలుండగు దానవ ♦ కుంజరుండు
తనధ్వజం బట్లు విఱిగినఁ ♦ గని విరోధి
పౌరుషము నోర్వఁ జాలక ♦ బలము మెఱసి ౭౯ 4679

క. ఘనకోపమ్మున మిక్కిలి,యును జ్వలియించెను, మహోక్రు ♦ ద్ధోగ్రుండగుచున్
దనరయొడలు తెలియక గ్రాసనిసమశరవృష్టి గ్రక్కు ♦ చందము తగఁగాన్.

క. ధరణీశునిగుఱ్ఱములను బరుషశరంబులను నొంచెఁ ♦ బరమాశ్వము లా
శరతతిఁ బాదస్ఖలనము, సరియగు గతిభంగమును బొ ♦ సంగక యుండన్. ౧౮౪

తే. నిలిచియుండుటె కాక నిర్మలసరోజనాళగాత్రనొందినట్లు మ ♦ నంబు చెదర
కట్టె స్వస్థములై యుండె, ♦ నంతరావణాసురుం డాత్మశరములఁ ♦ గావాయములు.

* తౌ తు తత్ర నిమిత్తాని దృష్ట్వా రామరాఘవౌ, కృతబుద్ధీ స్థిరామర్షౌ- అనిమూ

క. ఆతురము నొందకుండుటఁ, జేతంబున నరసి వినుగు ♦ చెంతక మిగులన్
భీతిం గనఁజేయుచున్, భూతలపతిమీఁద బాణ♦పుంజవృష్టిఁ గదుర్ ౧౬

క. కురియించె నంత గదలను, బరిఘంబులఁ జక్రములను ♦ బర్వతశృంగో
త్కరమును దరుశూలంబులఁ, బరశ్వధములన్ మహీశు♦పైఁ బరఁగించెన్

[1]చ. ధనువుననుండి శూలముఖ♦దారుణసాధనరాజి వైచి మఱి
ట్లనిన విచిత్రశక్తిని భ♦యంకరమై ప్రతినాద మిచ్చురీ
తిని బహుభంగులం దనరి ♦ తీవ్రమహాంబకవృష్టి దాని నో
య్యనఁ గురియించె; బెక్కులగు ♦ నస్త్రమయంబగు వర్షమద్దియున్ ౧౮

తే. ఓర్వఁ జాలనికోపంబు ♦ నూని కురియఁ
జేయఁబడుటను జవమున ♦ శ్రీరఘుపతి
యరణ్యమును మీఱి కపిసైన్య♦మందుఁ బడియె;
దనుజపతి యంత నుత్సాహ♦మును వదలక. ౧౯ 4686

చ. మన మొకలక్ష్యగుం దునిచి ♦ క్ష్మాపతిమీఁదను వేలసంఖ్యగా
ననుపమబాణముల్ వయిచి ♦ యాకసమెల్ల నిరంతరంబుగాఁ
గను బొనరించె వేగమునఁ, ♦ గర్బురనాయకుఁ డిట్లు యుద్ధమం
దునఁ బరతం జెలంగుచును ♦ ఘోరప్రయత్నము చేయుచుండుటన్. ౨౧ 4682

చ. జనపతి గాంచి [2]నవ్వినటు ♦ సాయకవారము వింటఁగూర్చి, నం
తనతఁడు లక్ష సంఖ్యలుగ ♦ దారుణబాణము లేయఁ గాంచి యా
దనుజవిభుండు బాణసము♦దాయము లాకసమెల్ల నిండ నే
సెను, మఱి వారలిద్దఱును ♦ శీఘ్రగతుల్ మెఱయంగఁ బూన్కితోన్. ౨౨

క. శరవర్షంబులు గురియఁగఁ, బరంపరలుగాఁగ నవియ ♦ వ్యాపించుట నం
బర మురుశరకల్పితముగు, సురపథభంగిగఁ జెలంగి ♦ చూడం దగియెన్ ౨౩

సీ. ఒకసాయకంబైన ♦ నురులక్ష్యమే లేక వైవంగఁ బడకుండె ♦ వరుస గుఱిని
భేదింప లేకపోక ♦ విశిఖమైనను గుఱిఁ దగిలి నిష్ఫలమైన ♦ దిగలుగ దొకఁ
డైన నీరీతి బా♦ణాళులఁ గురిపింప వారలశరములు ♦ వరుసమీఱి
నొండొంటి దాఁకుచు♦నర్వపైఁ బడియె, నవ్యాఘ్రసవ్యంబుల♦నరుగుచు నెపు

తే. డంబకంబులు వైచుచు ♦ నంబరమున
నూర్పు పుచ్చుట కేనియు ♦ నొక్కయింత
సందులేకుండ సాయక♦జాలములఁ దె
గంగఁ జేసిరి ఘోరసం♦గరము నపుడు ౨౬ 7690

1 ధనుషా కథం గదాదిమోచన మిత్యత్రాహ-అనునవతారక కీపద్యప్రథమపాదము తెనుఁగు.

2 ప్రహసన్నివ కాకుత్స్థః-అనిమూ

చ. దనుజవరేణ్యఘోటకవి♦తానము రాముఁడు రామచంద్రున
శ్శనికర మాసురారిపతి ♦ బాణపరంపరఁ గొట్టుచుఁ జవం
బున నితరేశరంబు బలు♦పూనికమీఱఁ బ్రతిక్రియం గరం
బొనరుచుచుఁ మహోగ్రముగ ♦ యుద్ధముచేయుచు నుండి రెంతయుఁ. ౨౭
ఆ. ఒకముహూర్తకాల ♦ ముగ్రంబుఁ దుముులంబు, రోమహర్షణంబు♦నై మఱింత
పూన్కితోడ జరగె♦భూరియుద్ధము, మహా,బలయుతుల్ సురారి♦పతినృపతులు.
క. సునిశితశరముల యుద్ధం,బును సల్పుచునుండ నసుర♦పుంగవుఁ డాత్మన్
దనధ్వజము గూల్చినందుల,కును నరపతిమీఁద మిగులఁ ♦ గోపం బొందెన్.

నూటతొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

## ౧౧౦ - వ సర్గము.

రాముఁడు రావణుశిరంబుల నూటయొకపర్యాయములు ఖండించుట.

చ. అని నపుడా నృపాలవరుఁ ♦ డాసురభర్తయు నొక్కపూన్కిఁ జే
య నిఖిలభూతముల్ మదుల♦యం దొగి విస్మయ మంకురింపఁగాఁ
గనుఁగొనుచుండ, వారలిటు ♦ గాంతరథంబులపైఁ జెలంగి యొ
క్కని మఱియొక్కఁ డుగ్రగతిఁ ♦ గ్రాలఁగ మార్కొనుచుఁ మహాక్రుధన్.
క శరముల నొప్పించుచుఁ దన,పరునిం జంపంగఁ దలఁచి ♦ బలువిడి నొప్పిం
ప రహిన్ వాహల సారథు, లరదంబుల రాకపోక♦లందు నిపుణతన్. ౧॥
తే. మండలంబుల వీథుల♦మహితగతివి
శేషములఁ జూపుచుండ నా♦చిత్రరథము
లతిభయంకరములుగాఁగ ♦ నగపడియెను,
రాముఁ డెంతయు నొప్పించె ♦ రావణు నని ౩॥ 4696
క. రావణుఁ డారఘురాముని, నావిధమున నొంచె నిట్లు ♦ లన్యోన్యము పెం
పావహిలన్ శరతతులన్, వేవే వైచుచును గమన♦వేగము నచటన్. ౨ 4697
క కనఁబఱచి రడరుటందును, వెనుకకుఁగాఁ బోవుటందు ♦ వితతంబుగ; నం
త నిరువురాగతిశరముల, ననూనముగ వైచుచుండ ♦ నావరరథముల్. ౪ 4698
క ధారాసారము గురిసెడు,వారిదములరీతిఁ గానఁ♦బడుచుండెను, నా
ఘోరాహవమున నీగతి, వా రరదముల బహుగతులఁ ♦ బఱవుచు మరలన్. ౫॥
ఆ నిలిపి రభిముఖముగ ♦ మెలఁకువ నన్యోన్య
రథములకు, ననంత♦రంబ యుద్ధ
మునను గమన మేమి♦యును లేనివారల
యరదములు తమంత ♦ నాస్థలమున. ౬॥ 4700
సీ. యుగముయుగంబుతో ♦ నొగఘోటకంబులు సైంధవములతో ధ్వ♦జంబుధ్వజము
తోఁ గూడియున్నట్లు♦తోఁచిపొల్చెను, రాముఁడంతఁ జాపమునుండి♦యతివిభాసు

రాంబకములు నాలు ♦ గడరించి రావణు నశ్వచతుష్కంబు ♦ నవతలఁ జను
నట్లు తోలెను, రా♦ణానుగుం డాత్మాశ్వములఁ దొలఁగించిన ♦దులకుఁ గ్రోధ

ఆ. పరవశుఁడయి తీవ్ర ♦ బాణంబు లారాము, పైనవైచె, రామ ♦ భద్రుఁ డట్లు
బలమునఁ దగుదనుజ ♦ వల్లభుశరములు, మేనఁ గ్రుచ్చుకొనిన ♦ దాన నాత్మ.

క. కనఁడయ్యె వ్యథ వికారంబును నుంతయు; దనుజవితతి ♦ పుంగవుఁ డమరే
శునిసారథియగు మాతలిఁ, గని కులిశాపాతరవము ♦ గల బాణములన్. ౧౧

క. సరిఁ బఱపె నతనిపై, నా, శరములు గురుజవము మెఱయఁ ♦ జని యంగమునం
జొరఁబడియెన్ దానికి నా, వరసారథి సుంత మూర్ఛ ♦ వ్యథను గనకయే.

క. స్థిరముగనుండెను, రాముం, డరాతి తనునొంచుటకు ర ♦ వంతయు నాత్మన్
బరమాగ్రహ మొందఁడు కాని రావణుఁడు మాతలిని సు ♦ నిశితశరములన్.

ఆ నొవ్వఁ జేయుటకు న ♦ నూనాగ్రహము నొంది
శరగణమ్ము లేసి ♦ శత్రుదనుజ
విముఖునిగ నొనర్చె, ♦ వీరుఁడౌ రాముండు
పదుల రెంటమూటఁ ♦ బదిట మఱియు ౧౪ 4705

క శరములను నఱువదింటను, మరల సహస్రముల దనుజ ♦ మాన్యరథంబున్
గరము మునుఁగంగఁ జేసెను,, నరదంబున నిశ్చలుఁడయి ♦ యాదనుజవుఁడున్.

మ. పరమామర్షముతో గదాముసలముల్ ♦ పైపైన వర్షించి భూ
వరు నొంచెం బ్రతిగాఁగ, నత్తఱిఁ గనన్ ♦ భారంబుగాఁ జాలభీ
కరమై గగ్గురుపాటు గల్గునటుగాఁ ♦ గం దొమ్మియుద్ధంబు త
త్తరుణంబందుఁ గనంబడెన్, ముసలసం ♦ తానంబులన్ వైవఁగన్. ౧౬ 4707

తే. గదల గుప్పింపఁ బరిఘని ♦ కరము వైవ
గల్గు రవములకు శరపుం ♦ ఖములపాత
మునకు ఘూర్ణిల్లె నాయేడు ♦ వననిధు లొగి,
సాగరము లట్లు ఘూర్ణిల్ల ♦ సకలఫణులు. ౧౭ 4708

క. పాతాళవసతు లాటను, నాతెఱఁగునఁ గంప మొంది ♦ రటు దానవులున్
భీతిలిరి వేనవేలుగ,, భూతలము నరణ్యశైల ♦ ములతో వడఁకెన్ ౧౯

చ ఖరకరుఁ డాత్మకాంతు లడఁ ♦ గం గృశియించెను, వీవకుండె నా
మగుడధిపుండు సిద్ధులును ♦ మానివరేంసులు దేశగాయకుల్
సురలు ను గిన్నరోరగులు ♦ సొంపు తొలంగఁగఁ జింతనొంది, ర
త్తఱుణమునన్ సురల్ మునిప ♦ తంసులు చక్కనిమాననంబులన్. ౨౦ 4710

తే. గోవులకు బ్రాహ్మణులకును ♦ గుశలము తగుఁ
గాక శాశ్వతములుగ జ ♦ గంబులుండుఁ

గాక రాముండు రావణుఁ ♦ గదనభూమిఁ
జక్కఁగ జయించుఁగాకని ♦ జప మొనర్చి. ౨౧॥ 4711

క. ఘోరమయి రోమహర్షణ, మౌ రాక్షసరాజ భూత♦లాధీశుల దు
ర్వారమహాహవముఁ బయిం, జేరి కనుంగొనిరి, చాలఁ ♦ జిత్రముగాఁగన్. ౨౨

సీ. గంధర్వులచ్చరల్♦గములుగాఁగూడి యప్పెనుసంగరముఁగాంచి♦యనుపమాన
మగుదానిపై ఖరి ♦ కచ్చెరుపడి యంబరమువంటి దైన ద♦భ్రంబె వనధి
వంటిది తలపోయ ♦ వనధియే యారీతి రామరావణులసం♦గ్రామ మనఁగ
రామరావణులసం♦గ్రామమువంటిదే యని పల్కుచున్ వారి♦యనిఁ గనుఁగొను

తే. చుండి, రారఘుకులకీర్తి♦మండనుఁడు మ
హాభుజుండగు రాముఁ డ♦త్యంతరోష
మున వెలుంగుచుఁ గ్రూరాహి ♦ కెనయయి క్షుర
మగ్రమునఁగల బాణ మ♦య్యదనునఁ గొని. ౨౪॥ 4713

చ. ధనువునఁ గూర్చి కాంతుల ని♦తాంతము గ్రాలుచుఁ గుండలోన్నతిం
దనరుచునున్నయాదనుజ♦తల్లజుశీర్షముఁ ద్రుంచె నద్ది యు
ర్విని బడ మూఁడులోకములు ♦ వేడుకఁ గాంచిన నట్టిశీర్ష మొ
య్యన మఱి యొక్కఁడప్పుడు త♦దంగమునన్ మొలచెం గ్రమంబునన్. ౨౬॥

తే. *అట్లు మొలచిన రెండవ♦దైన యతని
శిరము నేకార్య మైనను ♦ శీఘ్రముగ నొ
నర్చువాఁడౌట నన్నర♦నాథుఁడు నిజ
హస్తలాఘవమున సాయ♦కాళిఁ ద్రుంచె. ౨౭॥ 4715

చ. శిరమిది భూమిపైఁ బడిన ♦ శీఘ్రమ వేరొకమస్తకం బదే
వరుసఁ గనంబడెన్, నృపతి ♦ వజ్రసమానశిలీముఖంబులన్
ధరణిఁ బడంగఁ జేసె నని ♦ దానిని గూడ, నిదేవిధంబునన్
శిరములు పుట్టుచుండఁ గని ♦ శీఘ్రుఁడు యేకశతోత్తమాంగముల్
శిరములఁ ద్రుంచినన్ దనుజ♦సత్తము జీవితసంక్షయం బటన్ ౨౯ 4716

క. కనఁబడ కుండెను రామున,, కనుపమదివ్యాస్త్రవిదుఁడు ♦ హతరిపువీరుం
డును గౌసల్యానందం,బును వృద్ధిం గాంచఁ జేయు ♦ పూతధిషణుఁడున్

క. వీరుఁడునగు రాముఁడు మది, మారీచుని నెట్టి తీవ్ర♦మార్గణములచే
ఘోరాటవిఁ జంపితినో, క్రూరుల ఖరదూషణులను ♦ గోరికి మీఱన్. ౩౦

సీ. ఏ బాణముల వధి♦యించితినో మఱిసంకకాటవి విరా♦ధగనుజవరుఁ
గ్రౌంచాఖ్యవనమునఁ ♦ గర్బురేంద్రుఁ గబంధు నేబాణముల వధి♦యించివైచి

* క్షిప్రహస్తేన రామేణ క్షిప్రకారిణా-అనిమా

తినొ యాశరము లెల్లఁ ♦ దీవ్రయుద్ధంబున సఫలంబు లగునని♦సాన్వంతమందు
నమ్మియుండెడునట్టి ♦ విస్మితాంబకములు రావణునియందు ♦ నలఘుశక్తి
తే. మాని లఘుశక్తిగలవయి ♦ మ్రాన్పడి యిటు
లుండుటకు హేతు వేమియో ♦ యూహ చేయఁ
దోఁపకున్న దటంచు నా♦భూపుఁ డపుడు
చింతిలుచునుండి యంతలోఁ ♦ జింతమాని 33 4719

క మనమునఁ బరాకునొందక, దనుజేంద్రునురంబుపైన ♦ దారుణశరవృ
ష్టిని గురిసె, రథగతుండగు, మనుజాశనపతియుఁ గుపిత♦మానసుఁ డగుచున్.
క. అని రామునిపై గదలను, ఘనముసలంబులను వైచి ♦ కడునొప్పించెన్
మనుజేంద్ర దనుజనాయకు, లనుపమగతిఁ దద్ధరాధ♦రాగ్రము మీఁదన్. ౩౪
క పెనుక్రోధంబున నంబరమున కెగసియు ధరణిభాగ♦మును జేరియుఁ బో
రనీ భూమినభోగిరులను, గనుఁగొనఁ దూములంబుగాఁగ ♦ గగురుజనింపన్.
క. జరగెను భయంకరంబుగ,, సురదానవయక్షరాక్ష♦సులును బిశాచో
త్కరములుఁ బాములు గన నం,గర మది నప్తత్రియామ♦కంబుగఁ జెల్లెన్.
తే రాత్రిఁ బగటను నొకముహూ♦ర్తంబు నొక్క
క్షణమ యైనను వారల ♦ కదన మింత
యైనను విరామ మొందక ♦ యనుపమాన
మగుచు సాగెను జూడ న♦త్యద్భుతముగ. ౩౫ 4724
చ. దనుజవిభుండు నాదశర♦థప్రియనందనుఁ డేపుమీఱ ని
ట్లని నొనరింప తేనికి జ♦యం బిఁకనైనను గల్గ దేమొ యం
చనుపమబుద్ధివై భవము ♦ నందిన మాతలి సంగరంబుచే
యు నృపతిఁ గాంచి యిట్లనియె ♦ నూహ చెలంగఁగ సత్వరంబుగన్. ౩౬

నూటపదియవ సర్గము సంపూర్ణము

---

౧౧౧ - వ సర్గము

శ్రీరాముఁడు బ్రహ్మాస్త్రముచే రావణు వధించుట.

క. వీరవరేణ్యా! తెలియని,వారివలెన్ దనుజవిభుని♦భంగిఁ బెనఁగెదే
భూరమణా! మనుజులచే, నీరాక్షసుఁ డనిని దెగుట ♦ యెంచి యమర్త్యుల్.
తే. నిశ్చయించినకాలంబు ♦ నేఁడు వచ్చెఁ
గాన వీనివధంబున♦ కె సమయ
నిపుడు బ్రహ్మాస్త్రమును వైవు ♦ మనివిభుఁడు
ననుచు స్మృతిఁ గల్గఁజేసె నా♦యస్త్రమాత్మ ౧ 4727

* అంతరిక్షే చ భూమౌ చ పునశ్చ గిరిమూర్ధని-అనిమూ.

క. మాతలి పల్కినమాటల, నాతఱి రాముండు వీర్య ♦ మలరుచునుండన్
జేతస్సున స్మరియించుచు, భీతిల [1]బుసకొట్టు పాము♦విధమునఁ దగుచున్. ౩॥

క. అనుపమకాంతుల మెఱయుచుఁ, గన నద్భుతమైన బ్రహ్మ♦కాండమ్మును గై
కొనియెన్, భగవంతుండయి, [2]యనూనవీర్యమునఁబొల్చి♦యమలమహిముఁడై.

క. తనరారునగస్త్యుండును, దనకు విరించనుఁడు కృపను ♦ దయచేసిన దా
ని నమోఘము నగునస్త్రం,బును రామున కొసఁగె శత్రు♦పూగము నణఁపన్.

సీ. అమితతేజుండగు ♦ నబ్జజుం డద్దాని నింద్రునకై సృజి♦యించె మూఁడు
జగముల నొక్కట ♦ జయమందఁ గోరెదు శక్రునిమిత్తమై ♦ సారమైన
యస్త్రంబు నద్దాని ♦ నలరించి యొసఁగెను; మును దేనిఱెక్కల ♦ ననిలపతియు
నలుఁగున భాస్కరా♦గ్నులు నధిదేవతలై యుందురో దేని♦యుంగ మంబ

తే. రాభమై మేరుమందరా♦ఖ్యావనీధ
రములవలెనె గురుత్వంబు ♦ ప్రబలఁ దగునొ
యట్టి బ్రహ్మాస్త్ర మతిభాసు♦రాంగ మగుచు
గనకభూషితమును సుపుం♦ఖంబు నగుచు ౬॥ 4731

ఆ. వితతభూతసార ♦ మతులితంబు గ్రహించి, విరచితమయిసూర్య♦విధమునఁగడు
మెఱయుచుండు; ధూమ♦మిశ్రిత కాలాగ్ని,వలెను దీప్తభుజగ♦భంగిఁ దనరు.

క ప్రరనాగాశ్వశతంబులఁ, ద్వరగా భేదించునదియు ♦ దస్యునగరభీ
కరవిలసద్ద్వారంబులఁ, బరిఘంబుల గిరులఁ గూడఁ ♦ బ్రద్దలుచేయన్. ౮॥

క. నానాదనుజాస్రయుతం,బై నిజతనువొప్ప మెదడు♦నందు మునిఁగి యెం
తేనిన్ భీతికరంబై, యానిర్జరనాథువజ్ర♦మట్లు దృఢంబై ౯ 4734

క. గురునాదముకలదై సం,గరముల నేకపట మున్నఁ♦గాని విడువ కా
తురమునఁ జెండుచు భూతో,త్కరభయదంబగుచు నశని♦కల్పంబగుచున్.

తే. ఊర్పులను బుచ్చు ఫణిరీతి ♦ నొప్పి గృధ్ర
[3]కంకవశపక్షులకు వంచ♦కముల కసుర
గణములకు యుద్ధమందు ని♦కామతృప్తి
గాఁగ నాహారమొసఁగుచుఁ ♦ గ్రాలునదియు. ౧౧ 4736

క. అనిలో యమునిం బోలుచుఁ, గన భీకరమగుచు వెలయుఁ ♦ గపులకు మోదం
బును రాక్షసులకు నాశన,మును గల్గింపంగఁ జాలి ♦ ముఖ్యతమంబై. ౧౨॥

ఆ అందమగుచుఁ జిత్ర♦మయి పలురీతుల, వెలయు వైనతేయు♦వివిధపక్ష
తతినిఁ గట్టఁబడుచు ♦ సతతంబు లోకాళి,యందు నుత్తమ మగు♦నంబకమయి.

సీ ఇక్ష్వాకువంశ్యుల ♦ కెల్ల భయంబును బోఁగొట్టఁ జాలి రి♦పువ్రజముల
యశము హరించుచు ♦ నలరుచు రామున కత్యంతహర్షదం♦బై చెలంగు,

---

1 నిశ్వసంత మి వోరగమ్-అనిమూ 2 అమోఘం యుధి వీర్యవాన్-అనిమూ 3 కంకగృ
ధ్రబలానాం చ-అనిమూ.

నట్టి బ్రహ్మాస్త్రంబు ♦ నమ్మహాబలుఁడగు రాముండు గైకొని ♦ ధీమహీనము
వెలయుచు నంశఁగ ♦ వేదోక్తవిధిచేత మంత్రించి ధనువున ♦ మానితగతిఁ
తే. గూర్చి, నాగురుశరమును ♦ క్షోణివిభుఁడు
ధనువునం గూర్చుచుండ భూ♦తమ్ము లెల్ల
భయము నొందె ధరిత్రియు ♦ వడఁకె, రాముఁ
డంత సంక్రుద్ధుఁడై ధను ♦ వట్టె లాగి ౧౫॥ 4739
క. శరవర్యమ్మును దానిని, బరమర్మచ్ఛేదకమును ♦ బరమాయత్తుం
డురుబలుఁడునైన యాతఁ డసురపతిపై వైచె, నంత ♦ సునిశితశరముల్. ౧౬
క. సురపతిబాహుచ్యుతిఁ గని, త్వరగాఁ జనువజ్రమట్లు ♦ దారసిలన్ రా
కురుకల్పాంతయమాకృతిఁ, గరము నివారింపరాక ♦ కడు భీషణమై. ౧౭
మహాస్రగ్ధర. చని రక్షోనాథువక్షః♦స్థలిఁ బడియె, జవ♦స్ఫారముం గల్గి పద్మా
సనుశస్త్రం బద్ది యంతన్ ♦ సకలరిపుతనూ♦సంతతిన్ రూపుమాపం
గను జాలుం గాన వైవన్ ♦ గఱకుదనుజవ♦క్షస్థలిన్ దాఁకి చీల్చెన్;
ఘనమై ప్రాణాంతకంబై ♦ కఠినతరమునై ♦ క్రాలు నాయస్త్ర మంతన్. ౧౮
చ. దనుజునిఱొమ్ము నెత్తుటను ♦ దా నొగి మున్గుచు సత్వరంబ యా
తనివగు ప్రాణముల్ గొనుచుఁ ♦ దద్హృదయంబుననుండి లేచి చొ
చ్చెను ధరణిన్, శరం బదియు ♦ శీఘ్రము రావణునిన్ వధించి యా
తనిరుధిరంబునం దడిసి ♦ తచ్ఛవిఁ గ్రాలుచు భీకరాంగమై. ౧౯॥ 4743
క. తనపని యొనరిచి వినయం,బున నంబులపొదిని జొచ్చెఁ, ♦ బురుహూతరిపుం
డును హతుఁడై ప్రాణములను, దనజీవితమును ద్యజించు ♦ తక్షణమునందున్
ఆ. అతనిచేతనున్న ♦ యా పెనుచాపంబు, పట్టువదలి బాణ♦పంక్తితోడ
ధరణిఁ బడియెను, భయ♦దంబగు జవమును,వతుల తేజముగల♦యాదనుజుఁడు.
క. అసువులు చన వృత్రాఖ్యుం, డసురుఁడు వజ్రమునఁ గూలు♦నట్లుగ పడితో
డ సమరధరణి రథచ్యుతి, నమరులు భయమందఁ బడియె ♦ నాసమయమునన్.
క. హతశేషులైన దనుజులు, క్షితిఁబడిన సురారిఁ గాంచి ♦ స్వీయవిభుండున్
హతుఁ డగుట బెదరి దిక్కుల, కతిజవమునఁ బాఱి, రంత ♦ నాకపివరులున్.
క. తరుహస్తులగుచుఁ బంచా,స్యరవంబులు చెలఁగ రాక్ష♦సాళిని నాసం
గరభూమినుండి తోలిరి, సురవైరులు తమవిభుండు ♦ క్షోణిఁ బడుటయున్
క. రాముఁడుజయంబునొందుటఁ, దా మొగిఁగనుఁగొనుచుఁగపివి♦తతిహర్షమునన్
భేమగతిం చము నొంపం,గా మానము దూలి ప్రాపు♦గల్గమి మిగులన్. ౨౫॥
తే. ఆననంబుల బాష్పంబు ♦ లుట్టిపడ్డఁ
గరుణఁ బుట్టెడురీతి లం♦కను గనంగఁ
బాఱి రతిభీతులై, జయ♦ప్రథలవెలయు
వానరులు సంప్రమోదసం♦స్వాంతులగుచు. ౨౬॥ 4750

క. రాముని జయంబు గావడుఁ, డామెయిఁ దెగుటయును బొగడి ♦ యారవములచే
భూమివశంకరంగఁ జేసిరి, వ్యోమము నక్ శుభరవంబు ♦ లొప్పుచునుండన్. ౨౬౪
క. సురదుందుభి మ్రోసెను, సత్పురుషులు శుభముల దాల్చి యనిల♦పతి సుఖముగ న
త్రరుణమున వీచె, రాముని,యరదము పయి దివమునుండి♦యలరులగుములున్.
ఆ. త్రోయ రాకయుండఁ ♦ దోడ్తోనఁ గురిసెను;
ధరణిఁ గపులనుతుల♦తతులె కాక
యంబరమున సుమహి♦తాత్ములౌ దివిజుల
సాధుసాధు వాక్య♦సముదయ మొగి. ౨౮౪ 4753
క. వినఁబడియె భూమియందును,, దనుజుఁడు రౌద్రుండు లోక♦తతిభీకరుఁ డ
య్యనిఁ దెగుట దేవచారణు, లనూన మోదంబు నొంది, ♦ రంత నృపతియున్.
చ దనుజలలాముఁ ద్రుంచి ప్రమ♦దంబును దాఁ గని స్వీయరాజ్యముం
గొనిన దివాకరాత్మజుని ♦ గోయలగాత్రు మహాబలాఢ్యునిన్
వనచరనాథుపుత్త్రుఁడయి ♦ వ్రాలిన యంగదుఁ బ్రీతచిత్తులై
తన రెడునట్లొనర్చి, సుర♦తల్లజు లందిరి సుప్రసన్నతన్ ౩౧ 4755
సీ. దిశలెల్ల నిర్మల♦దీప్తుల వెలుఁగొందె విమలరీతిని విను♦వీధి వెలసె
ధరణి కంపింపక ♦ తనరారె, వాయువు చక్కఁగా వీచె భా♦స్కరుఁడు సుస్థి
రప్రకాశుండయి ♦ రాజిల్లె, నర్కపుత్త్రవిభీషణాదులు ♦ తగినమిత్త్రు
లగు జాంబవన్ముఖు ♦ లాలక్ష్మణుం గూడి యరిగి రాముఁడు విజ♦యంబు నొంది
తే యుంట కెంతయు హృష్టులై ♦ యొప్పుమిగుల
నలరు రాముని నియతిఁ బూ♦జాదికముల
నలరఁ జేసిరి, గురు తేజుఁ ♦ డగుచు రఘుకు
లాధిపుల కాద్యుతిం గూర్చు ♦ నాన్పుఫుండు. 33 4756
చ అని రిపులన్ వధించి తన♦దౌ శపథంబును దీర్చి చక్కఁగా
వనచరసంఘయుక్తుఁడయి ♦ వాసవుఁ డయ్యమరాళిఁ గూడి యొ
ప్పినగతి దేవతానుతులఁ ♦ బెంపువహించుచు రామచంద్రుఁ డొ
ప్పెను జగమెల్ల హాయిఁ గని ♦ ప్రీతి వహించుచు నుండ సంతతన్. ౩౪
నూటపదునొకండవ సర్గము సంపూర్ణము.

## ౧౧౨ - వ సర్గము.

-రాముఁడు విభీషణు నాశ్వాసించుట-

కే. రాముని ద్విగతుఁడగు గత♦ప్రాణుఁ డగుచు
ధరణిఁ బడియున్న యన్నను ♦ దనుజ బలిని
గాంచి వగపెల్లి దంబునఁ ♦ గదలు మది వి
భీషణుం డిట్లు శోకించెఁ ♦ బెంపు దూలి. ౧ 4758

క. వీరా! విఖ్యాతమహా,శూరా! సువినీతశాస్త్ర ♦ శుంభత్ప్రాండి
త్యా! రమ్యశరనుశయ్యన్, గారనముగ బవ్వళింపఁ ♦ గాఁ దగదు గదా?. ౧౫
క. అని నిహతుండవై దీర్ఘము, లనుపమములు నైన భుజము ♦ లట్టిటు చలనం
బును గాంచకుండ నంగర,ఘనభూమి యము లను నీల్గు ♦ గాఁ జూచి కడున్. ౨
క. ధరఁబడుట నుంత గదలిన,సరసిజమిత్రాభ మగుకఁ ♦ జంచద్దీతిం
బరఁగెడు ముకుటముతో నీ,ధరఁ బడియున్నాఁడ వేల? ♦ దనుజవరేణ్యా!. ౩
క. మును వీరా! యెట్టిఫలం, బనూనముగఁ గల్గు ననుచు ♦ ననువాదము చే
సినవాఁడనొ యాపలుకులు, మనసిజమోహావృతమగు ♦ మది నీకగుటన్. ౩౫
తే. ఎంతమాత్రముకుచియింప ♦ కేచనియెను,కత్త్పలమునేఁడునీకుఁబొం ♦ దంగవలసె;
నాప్రహస్తేంద్రజిత్తుల ♦ న్యదనుజ ళి,కుంభకర్ణుండును నరాంత ♦ కుండుమఱియు.
క. అతిరథుఁడగునతికాయుఁడు, దితిజేశుఁడ వీవు నైనఁ ♦ దీవ్రంబగు ను
ద్ధతిసీతాహరణమున జ,నితమగు పాపంబు నెన్న ♦ నేఱరు గాదే. ౪ 4764
తే. దానికిం దగుఫల మిట్టి ♦ దఁటసి గల్గె,, వివిధనీతివితాన సే ♦ తువు గతించె
ధర్మవిగ్రహ మేగె, స ♦ త్వసిధి చనియె, స్తోత్రపాత్రోవిషయమే ♦ పోలె నకట.
చ. సరసిజబాంధవుం డిపుడు ♦ క్ష్మాపతిపైఁ బడునట్టులున్ నిశా
కరుఁడు తమస్సులో మునుఁగఁ ♦ గాఁ దగునట్టులు పితిహోత్రుఁడున్
ద్వరపడి చల్లనైనటులు ♦ భాసురశస్త్రవితానధారులం
దరయఁగ మేలుబంతియగు ♦ నట్టిఁడు వీరుఁడునైన యీతఁడీ
ధరఁ బడనయ్యె, నాశ్రయమె ♦ తాఁ గననేరకయే కృశించుచున్. ౭౫ 4766
తే. తనదువ్యాపార మెడల ను ♦ త్సాహశక్తి
యున్న దయ్యెను, దనుజగ ♦ ణోత్తముఁ డని
నిహతుఁడై పాంసుదిగ్ధుఁడై ♦ నిద్రపోయి
నట్టులుండఁగ నిట్టి వీ ♦ రాధిపతిని. ౮౫ 4767
తే. కోలుపోయిన ధరనుండఁ ♦ జాలు నేది
యింక, ధైర్యమె చిగురుగ ♦ హితముగ ప్రస
హనమె సాధుప్రసూనంబు ♦ గను దపంబె
బలముగా శౌర్యమే మూల ♦ వరముగాఁగ. ౯౫ 4768
క తనరెడు రావణభూరుహ,మును రాఘవమారుతము స ♦ మూలముగాఁ ద్రెం
చెను, దేజంబె విషాణము,గను బూర్వ్వలగణమె వీఁపు ♦ గాఁ గనుపట్టన్. ౧౦
క. ఘనకోపమె తలక్రిందుగఁ, గనఁబడ దేహముగ వఱ మె ♦ కరముగఁ దగునీ
దనుజేశమత్తగజమును, మనుజాధిపసింహ మొక్క ♦ మాడ్కి బలిమిమై. ౧౦౫
తే. పట్టుకొని చంపి నేలపైఁ ♦ బడఁగ వైచె,
విక్రమోత్సాహములు విజృం ♦ భించినట్టి

జ్వాలలుగ నూర్పులే ధూమ♦సంచయముగ
స్వబలమే యుష్ణముగ సుతే♦జంబు చెలఁగ. ౧౧ 4771

క. వెలసెడు రావణవహ్నిని, సిలాధిపతియైన రఘుకు♦లేశుఁ డనంగాఁ
జెలఁగెడు మేఘుఁడు చల్లాఁ, ర్చె లలిన్, నిశ్శేషముగ వి♦రించి కృత మిదా.

*సీ. దనుజవక్త్ర లెవాల♦మునుమూఁపురమువిషాణములుగాఁదగరిపు♦సమితిగెలువఁ
జాలివైరుల నెల్ల ♦ సమయింప వఁలఁతియై గంధద్విపంబునాఁ ♦ గ్రాలి విషయ
చాపల మనునదె ♦ శ్రవణచక్షుస్సులై యులశారు రక్షోగ♦ణాధిపవృష
మని రామశార్దూల♦మున హతమై పడె,నని శోకసంయుక్తుఁ ♦ డగుచు యుక్తి

తే. యుక్తవాక్యాలఁ బలుకుచు ♦ నొప్పునర్థ
మిట్టిదని తర్కమున నిశ్చ♦యింప నేర్చి
నట్టి యవ్విభీషణుఁ గని ♦ యనియె రాముఁ,
డితఁడు తనవిక్రమము చూప ♦ కితరులవలె. ౧౪ 4778

క ధరఁ బడలే దితఁడు సం,గరమున విక్రమము భయముఁ ♦ గల్గింపంగా
సరిచూపుచు నుత్సాహము, పరఁగన్ భయమెడల నేలఁ ♦ బడియెం గంటే?.

క. పరలోకవృద్ధిఁ గోరుచు, ధరణీశ్వరధర్మమందుఁ ♦ దమి నిలిచి రణా
జిరమున హతులగు పూరుష,వరులం దలపోసి యిట్లు ♦ వగవఁ దగదనూ ౧౬

చ. శతమఖుతో జగత్త్రయము ♦ సాధ్వస మందెను యేనివిక్రమో
ద్ధతి; కల బుద్ధిమంతుఁడగు ♦ దానవనేత యనింబడంగ ని
వ్వితమున దుఃఖ మొందుదురె, ♦ వింతయె చావన దుఃఖ మొందుటం
చితరులఁ బోలి పల్కెదవొ ♦ యేమొ? జయంబె రణాంగణంబునన్. ౧౭

తే. కలుగునని యెడు నియము మి♦క్కాలమువఱ
కెప్పుడును బుట్టలేదనూ ♦ హితమనీష!
వీరుఁ డని శత్రువులనైన ♦ విక్రమమునఁ
జంపు రిపుహతుఁ డగు దాను ♦ సత్వమెడల ౧౮ 4777

చ మనమున క్షత్రధర్మ మొక♦మాటు తలంపుము సంగరాంగణం
బున హతుఁడై సురాలయముఁ ♦ బొందుట పూర్వులచేత నుక్తమై
తనరెడు, క్షత్త్రియావళి మ♦తంబును నోఁ, బ్రథనంబునన్ మృతిం
గను ధరణీశుఁగూర్చి వగఁ ♦ గాంచఁగ రాదని శాస్త్రి మెన్నుఁజూ. ౧౯

చ. కనుకనె శాస్త్రనిశ్చయముఁ ♦ గాంచి జనించిన వార లంతముం
గనుట ధ్రువంబటంచు మతిఁ ♦ గాంచి వగం దగ మాని యింకనే
పని యొనరింపనౌనొ యది ♦ బాగుగ నెంచు మటంచుఁ బల్కె, ని
ట్లనిహతవిక్రముండయిన ♦ యానరనాథుఁడు పల్క నాతఁడున్. ౨౦ 4779

* సింహర్క్షలాంగూలకకు ద్విషాణః పరాభిజిద్గంధనగంధహస్తీ, రక్షోవృషశ్చాపలకర్ణచక్షుః క్షితీశ్వరవ్యాఘ్రహతోఽవసన్నః-అనిమూ సింహర్క్షాః రాక్షసాః-అనివ్యాఖ్య.

తే. శోకసంతప్తుఁడగుచు న♦స్తోకవిక్ర, మాధికుండగు నన్నకు ♦ నపుడు చేయఁ
దగినహితమేదియనియెంచి♦గఁగన్నపాఁ,కునకునిట్లనిపల్కెను, ♦ వినయమలర

చ. చెలియలికట్ట నొంది గుఱు♦సింధువు భంగము నొందినట్లుగాఁ
గలనున నిన్నుఁ దాఁకి తన♦గర్వము దూలి నశించె నీతఁడే
తొలుత నమర్త్యనాయకుని♦తోఁ ద్రిదశులఁ దనుమార్కొనంగ ని
స్తులజయ మందె కాని తన♦శూరత పోవఁగ నోడఁ డెప్పుడున్. ౨౨ 4781

తే. దానములు చాలఁ జేసి సం♦తతము గురువు
లను నమర్త్యులఁ బూజించి ♦ తనివి నవఁగ
భోగములఁ బొంది భృత్యులు ♦ పూర్ణసుతులు
గాఁగఁ బోషించి సంతృప్తి♦గా సఖులకు ౨౩ 4782

చ. ధనములనిచ్చి శత్రుసము♦దాయమునం బగఁ జక్కఁదీర్చి ని
ష్ఠను జ్వలనున్ విధానమున ♦ సంతితహోమములన్ సుతృప్తిఁ గాం
చునటులు చేసి స తపము ♦ శోభిల జ్ఞానియు నొచుఁ గర ్రా
శిని నొనరించి పెంపుఁగనెఁ ♦ జిత్రముగా ధర నట్లుగావునన్. ౨౪ 4783

సీ. చక్కనిసంస్కార♦సంయుతిఁ గనఁదగువాఁడైన యీసుర♦వైరిపతియుఁ
బ్రేతత్వ మిట్లొంద ♦ నీతతిఁ జేయనొకృత్యంబునే నీదు♦కృపను బొంది
యొనరింపఁగాఁ గోరు♦చున్నాఁడ, నని యిట్టు లావిభీషణుఁడు కృ♦పావలంబ
నములగు పల్కుల ♦ నమరఁ దెల్పఁగ మహితాత్ముఁడై బలవంతుఁ♦డైనరాముఁ

తే. డాసురారికి స్వర్గీయ ♦ మైనయట్టి, నాధుసంస్కార మొనరింపఁ♦జను నటంచు
నాజ్ఞనిడఁబూనియీరీతి♦ననియె, మరణ, మెప్పుడగునప్పుడే వైర♦మెల్లఁదెగును.

క. కనుకనె యింకం బగతోఁ, బనిదేమియు లేదు, మనకు ♦ వలయుపనియు న
య్యెను నిక సంస్కారంబును, బొనరింపుము తడవదేల ♦ పూతచరిత్రా. ౨౫

ఆ నీకు నెట్లు దనుజ♦నేత యీతఁడు తోడఁ,బుట్టు వగునొ నాకు ♦ నట్టులె యగు
సోదరుండు మఱొకఁ♦డూహింపఁ బనిలేదు, శ్వరగఁగృత్య మింక♦వలయుఁ జేయ.

నూటపండ్రెండవ సర్గము సంపూర్ణము.

---

౧౧౩ - వ సర్గము

రావణునార్యలు విలపించుట

క అనిపలికె, నంత నచ్చట, దనుజేంద్రుఁడు హితుఁడైన ♦ దశరథసుతుచే
తను హతుఁ డౌటను విని యా,తనిభార్యలు శోకకర్శి♦తలయి వగచుచున్. ౧

---

* నివృత్తం నః ప్రయోజనమ్-అనిమూ ఇచట నం ప్రయోజనమ్ అనుచోట నున్న శ్లోక ద్వాదశాక్షరమగు 'న'యనువర్ణము గాయత్రియం దిరువదవదగు నక్షరమని గ్రహింపఁదగు. అనఁగా నిరువదవసహస్ర మారంభమయ్యెనని సారము ఇటఁ దెనుఁగున కందపద్యద్వితీయపాదమున "మనకు" అనుచోటనున్న "న" కారము నః అనుసంస్కృతమునకుఁ బ్రతినిధియని తెలియం దగు.

చ. వలదని యెంత చెప్పినను ♦ వారలు మానక భూమిఁ బొంసులన్
గొలఁదికి మీఱు నెవ్వగలఁ ♦ గుందు మదిన్ దొర్లుచు ముక్తకేశులై
కలఁగుచు దూడ లంతమున ♦ గాంచఁగ నుత్తలపాటునొందు గో
వుల క్రియ సౌధముల్ విడిచి♦పోయిరి నాథునిఁగాంచునాశలన్. ౨ 4788

క. ఆరాక్షసకాంత లసుర,వీరులతోఁగూడ వేగ ♦ వెడలి యుదీచ్య
ద్వారంబున భయదంబయి, చేరన్ రానట్టి యచటుఁ ♦ జేరి వగవునన్. 3

*క.హతుఁడైన పతిని వెదకుచు, క్షితినాథకుమార! యనుచు ♦ శ్రీరాఘవునిన్
బతి రావణు నాథా! యని, యతిదుఃఖముమీఱఁ బిల్చి ♦ యారవ మెసఁగన్.

తే శోణితం బనుపంకంబు ♦ సొంపుఁ గూల్పఁ
గాఁ గబంధాంకమయి యున్న ♦ కలహభూమి
నంతటం బూన్కిఁ దిరిగి, రా♦యతివలు పతి
మరణశోకంబుచేఁ గుంది ♦ మ్రాన్పడి కడ. ౪ 4791

చ కనులను నీరునిండునటు♦గా వడి నేడ్చుచు యూథనాథుఁ డో
య్యన మృతి నొంద నాఁడుగజ♦మట్టులు బిగ్గఱ నార్చి, రంత నా
వనితలు వీర్య తేజములు ♦ వర్ష్మము భూరితరంబుగాఁగ న
ల్లనిదగు నంజనంపుగుమి♦లాగున నొప్పుచుఁ జచ్చి భూమిపై. ౫ 4792

క పడియున్న భర్తఁ గని రా,ప్పడఁతులు, రణపాంసువితతిఁ ♦ బడుకొనినటు క
న్పడుచున్న ప్రాణనాథుని, వడిఁ గని పరవశలునగుచు ♦ వనట మునుఁగుచున్.

క వనలతలు త్రెంపఁబడి చ,య్యన ధరణిన్ వ్రాలునట్టు ♦ లాతనిగాత్రా
ళినిఁ బడి, రంతట నందొక, వనితామణి ప్రేమభరము ♦ వర్ధిలుచుండన్. ౭

ఉ రావణుఁ గౌఁగిలించుకొని ♦ రామునిచేఁ దెగినాఁడవే? కటా!
యీవిధినంచు నేడ్చె, నొక♦యింతి పదంబుల వ్రాలెఁ, గంఠముల్
జేవచెలంగఁ గౌఁగిటను ♦ జేర్చి వధూమణి యొత్తుకుండె, న
వ్వావనమూర్తిచావునకు ♦ బాల యొకర్తుక చేతు లెత్తుచున్ ౮ 4795

చ ధరఁ బొరలాడె, నొక్క వని♦తామణి చచ్చిన భర్తమోము న
త్తరుణమునం గనుంగొనుచుఁ ♦ దానట మూర్ఛిలె, భర్తశీర్ష మొ
క్కరమణి యంకభాగమునఁ ♦ గ్రన్ననఁ జేరిచికొంచు మోము నా
తురమునఁ గాంచుచున్ దుహిన♦తోయము పద్మము నట్లు నెవ్వగన్ ౯

తే. బాష్పవారిని దడుపుచుఁ ♦ బ్రబలరవము
చెలఁగ నేడ్చెను, నిట్టులా♦చేడె లెల్ల
నిహతుఁడై ధరఁబడియున్న ♦ నిజవిభుఁ గని
యార్తలై యేడ్చి యాశోక ♦ మధిక మగుట. ౧౦ 479

* రాజపుత్రేతి వాదిన్యః హానాథేతి చ సర్వశః-అనిమా

